జయంతి రామయ్య పంతులు గారి

# శాసన పద్యమంజరి



సంపాదకులు
డా. ఈమని శివనాగిరెడ్డి-స్థపతి
డా. కొండా శ్రీనివాసులు
డా. జి.వి.పూర్ణచందు

ప్రధాన సంపాదకుడు
డా.దీర్ఘాసి విజయభాస్కర్

జయంతి రామయ్య పంతులు గారి

# శాసన పద్యమంజరి

(ఒకటవ, రెండవ భాగాలు)



సంపాదకులు

డా. ఈమని శివనాగిరెడ్డి-స్థపతి

డా. కొండా శ్రీనివాసులు

డా. జి. వి. పూర్ణచందు

కార్యనిర్వాహక సంపాదకులు

డా. దీర్ఘాసి విజయభాస్కర్

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సృజనాత్మక & సంస్కృతి సమితి

అమరావతి-2018

జయంతి రామయ్య పంతులు గారి

# శాసన పద్యమంజరి (ఒకటవ, రెండవ భాగాలు కలిపి)

సంపాదకులు

**డా. ఈమని శివనాగిరెడ్డి-స్థపతి,**

సీఈవో, కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ& అమరావతి

**డా. కొండా శ్రీనివాసులు,**

ఆం.ప్ర. చరిత్ర కాంగ్రెస్ పూర్వ కార్యదర్శి

**డా. జి.వి. పూర్ణచందు,**

కృష్ణాజిల్లా రచయితలసంఘం కార్యదర్శి

ప్రధాన సంపాదకులు

**డా. దీర్ఘాసి విజయభాస్కర్,**

సీఈవో, ఆం.ప్ర. సృజనాత్మకత & సంస్కృతి సమితి

కాపీలు : 1000

వెల : రు. 150.00

ఒకటవ భాగం ప్రథమ ముద్రణ : 1930

రెండవ భాగం ప్రథమ ముద్రణ : 1937

పునర్ముద్రణ : 29-07-2018

ప్రతులకు :

**ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత & సంస్కృతి సమితి**

2వ అంతస్తు,

ఘంటసాల వెంకటేశ్వరరావు సంగీత నృత్య కళాశాల,

దుర్గాపురం, విజయవాడ-3.

ఫోన్ : 96188 48470

డి.టి.పి.: **మలపాక సోమయాజులు**

కవర్ పేజీ : **గిరిధర్ అరసవెల్లి**

ముద్రణ : **మల్లెతీగ ముద్రణలు**, విజయవాడ- 98669 08843






ఆంధ్రప్రదేశ్ శాసనసభ,
వెలగపూడి,
అమరావతి.

**డా. మండలి బుద్ధప్రసాద్**
గౌ. ఉప సభాపతి

# హృద్యసుందరి శాసన పద్యమంజరి

నన్నయకు బాగా ముందే తెలుగులో పద్యముందని తెలియజెప్పిన శ్రీ జయంతి రామయ్య పంతులు గారు తెలియని తెలుగు చరిత్రకారులు, శాసన పరిశోధకులు, సాహితీ మూర్తులు వుండరంటే అతిశయోక్తి కాదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో తెలుగు పద్యాలున్నాయని మొట్టమొదటిసారిగా చెప్పింది ఆయనే. శాసనాలను సేకరించి, పరిష్కరించి, దక్షిణభారత శాసనసంపుటి పేరిట ప్రచురించిన ఘనత ఆయనకే దక్కుతుంది. ఆంధ్రసాహిత్య పరిషత్తు ఏర్పాటులో కీలకపాత్ర పోషించటమేకాక, ఎన్నో శిలా శాసనాలను ఆ సంస్థ పత్రిక ద్వారా వెలుగులోకి తెచ్చి తెలుగువారి చరిత్రను సుసంపన్నం చేశారు. తనకున్న ఆసక్తి కొద్దీ అనేక శాసనాల నకళ్ళను ముందేసుకుని, వాటిలోని పద్యాలను, గుర్తించి గణ విభజన చేసి, ఛందస్సుతో పాటు రెండు భాగాలుగా 'శాసనపద్యమంజరి' అనే పుస్తకాలను ప్రచురించి తెలుగు చారిత్రక సాహిత్య జగత్తుకు ఎనలేని సేవ చేశారు.

1930, 1937 సంవత్సరాల్లో వరుసగా జయంతి రామయ్య పంతులుగారి **శాసనపద్యమంజరి** మొదటి, రెండు భాగాలు ముద్రించబడి ప్రజల మన్ననలు పొందాయి. ఆ పుస్తకాలు ఇపుడు అందుబాటులో లేనందువల్ల ఈతరం పరిశోధకులకు అందించాలనే ఉద్దేశంతో పురావస్తు పరిశోధకులు, కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ & అమరావతి, సీఈవో, డా॥ ఈమని శివనాగిరెడ్డి-స్థపతి, కృష్ణాజిల్లా రచయితల సంఘం కార్యదర్శి, డా॥ జి.వి.పూర్ణచందు, శాసన పరిశోధకులు డా॥ కొండా శ్రీనివాస్‌లు ఈపుస్తక పునర్ముద్రణకు పూనుకోవటం హర్షించదగ్గ విషయం. ఈ సందర్భంగా వారిని నేను అభినందిస్తున్నాను.

తెలుగువారి సంస్కృతిలో భాగమైన శాసనసాహిత్యంపట్ల మక్కువతో **శాసనపద్యమంజరి** రెండు భాగాలను ఒక పుస్తకంగా తీసుకొచ్చిన **కేంద్ర నాటక అకాడమీ** అవార్డు గ్రహీత, ఆం.ప్ర.రాష్ట్ర సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి, సీఈవో, డా.దీర్ఘాసి విజయభాస్కర్ గారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను.

కీ.శే.జయంతి రామయ్య పంతులు గారి 'శాసనపద్యమంజరి' యువపరిశోధకులకు ఎంతో ఉపకరిస్తుందని ఆశిస్తూ...

20-07-2018
అమరావతి

**-డా.మండలి బుద్ధప్రసాద్**






ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత &
సంస్కృతి సమితి
ఘంటసాల వెంకటేశ్వరరావు
ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాల
దుర్గాపురం, విజయవాడ.

**డా. దీర్ఘాసి విజయభాస్కర్**
సీఈవో

# ఫలించిన కల

తెలుగులో వచన కవిత్వం క్రీ.శ. 6వ శతాబ్దిలో ప్రారంభమైంది. క్రీ.శ.9వ శతాబ్దిలో పద్యకవిత్వం ప్రారంభమైనా, శాసనాలను పరిశోధించిన తరువాత గానీ ఈ విషయం వెలుగులోకి రాలేదు. కీ.శే.జయంతి రామయ్య పంతులుగారు, తెలుగు శాసనాల్లో పద్యాలను గుర్తించిన తరువాత నన్నయ కంటే ముందు తెలుగులో కవిత్వం లేదనే వాదన వీగిపోయింది. 1920వ దశకంలో జయంతి రామయ్య పంతులుగారు తెలుగు శాసనాలను సేకరించి, వాటిలోని పద్యాలను గుర్తించి, కాలానుక్రమణికలో **శాసనపద్యమంజరి** పేరిట 1930లో మొదటి సంపుటాన్ని, 1937లో రెండో సంపుటాన్ని **ఆంధ్రసాహిత్య పరిషత్తు** ద్వారా ప్రచురించి అందుబాటు లోకి తెచ్చారు.

88 ఏళ్ళ క్రితం ప్రచురించిన మొదటి సంపుటం, 57ఏళ్ళ తరువాత పునర్ముద్రణ పొందినా ఈ తరానికి ఆ రెండు సంపుటాలు అందుబాటులో లేవు. చరిత్ర సాహిత్య విద్యార్థులు, పరిశోధకుల విజ్ఞప్తి మేరకు జయంతి రామయ్య పంతులుగారి **శాసన పద్యమంజరి** రెండు సంపుటాలను కలిపి, ఒకే సంపుటంగా తీసుకురావటానికి చరిత్ర, పురావస్తు పరిశోధకులు, కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ& అమరావతి, సీఈవో, డా॥ఈమని శివనాగిరెడ్డి పూనుకోవటం ఆనందించదగ్గ విషయం. ఈ సందర్భంగా ప్రచురణ బాధ్యత చేపట్టిన ఆంధ్రప్రదేశ్ సృజనాత్మక మరియు సంస్కృతి సమితి పక్షాన సహసంపాదకులు డా.జి.వి.పూర్ణచందు, డా.కొండా శ్రీనివాసులుగార్లను కూడా అభినందిస్తూ, ఈ పుస్తకం చరిత్ర, సాహిత్యం విద్యార్థులు, పరిశోధకుల ఆదరణ చవిచూస్తుందని ఆశిస్తూ, కీ.శే. జయంతి రామయ్యపంతులుగారిని స్మరించుకుంటూ...

20-07-2018
అమరావతి

**దీర్ఘాసి విజయభాస్కర్,** సీఈవో

# మనవి మాటలు

తెలుగునేలపై శాసన పరిశోధన ప్రారంభమై రెండు శతాబ్దాలైంది. వాటి నకళ్ళను ప్రామాణిక పత్రికల్లోనూ, అప్పటి పురావస్తు సర్వేక్షణసంస్థ సంపుటమైన **ఎపిగ్రాఫియా ఇండికా**లోనూ, ఇతర సంస్థల పత్రికల్లోనూ ప్రచురించేవారు. **దక్షిణభారత శాసన సంపుటులు, ఆంధ్రసారస్వత పరిషత్ పత్రిక**కోసం శాసనాలు సేకరించటంలో భాగంగా ప్రముఖ శాసన పరిశోధకులు శ్రీ జయంతి రామయ్య పంతులుగారు, **శాసన పద్యమంజరి**ని రెండువిడతలుగా ప్రచురించారు. దీనివల్ల నన్నయకంటే ముందు 178సం॥ పూర్వమే తెలుగులో పద్యము పుట్టిందని నిరూపించారు. 1937లో రెండవభాగము పీఠికలో రామయ్యపంతులుగారు 'ఇపుడు విడివిడిగా నుండు భాగములు రెండును వ్యయమైన పిదప నారెండుభాగముల పద్యములను గలిపి యొక పుస్తకముగా ముద్రించెదము' అని పేర్కొన్నారు.

ఆ మహనీయుని ఆశయం ప్రకారం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సృజనాత్మకత & సంస్కృతి సమితి, సీఈవో, డా. దీర్ఘాసి విజయభాస్కర్‌గారి పుణ్యమా అని ఆ రెండు పుస్తకాల్ని కలిపి ఒక్కటిగా జయంతి రామయ్య పంతులుగారి **శాసనపద్యమంజరి**ని తీసుకురావటమైంది. మొదటి భాగములోని గ్రామాల వరుసక్రమం, రెండవ భాగము లోని గ్రామాల వరుసక్రమం, యథాప్రకారమే కొనసాగించి, మొదటిభాగములోని 88గ్రామాల తరువాత, రెండోభాగంలోని మొదటిగ్రామం నుంచి 89 నుంచి కొనసాగించటమైంది. పాఠకులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

**డా. ఈమని శివనాగిరెడ్డి-స్థపతి**
**డా. కొండా శ్రీనివాసులు**
**డా. జి. వి. పూర్ణచందు**

vii

# కృతజ్ఞతలు

**శ్రీమతి భూమా అఖిలప్రియ,**
గౌ. ఆంధ్రప్రదేశ్ భాష, సాంస్కృతిక, పర్యాటక శాఖామాత్యులు,
**డా. మండలి బుద్ధప్రసాద్,** గౌ. ఉపసభాపతి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ,
**శ్రీ ముఖేష్ కుమార్ మీనా,** ఐ.ఎ.ఎస్, కార్యదర్శి, పర్యాటకశాఖ, ఆం.ప్ర.,
**డా.దీర్ఘాసి విజయభాస్కర్,** సీఈవో, ఆం.ప్ర.సృజనాత్మకత & సంస్కృతి సమితి,
కీ.శే. జయంతి రామయ్యపంతులు గారు,
**డా.జి.వి.పూర్ణచందు,** కార్యదర్శి, కృష్ణాజిల్లా రచయితలసంఘం,
**డా.కొండా శ్రీనివాసులు,** ఆం.ప్ర.చరిత్రకాంగ్రెస్ పూర్వ కార్యదర్శి
**శ్రీ వై.హరిశ్చంద్రప్రసాద్,** ఛైర్మన్, మాలక్ష్మిగ్రూప్&కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ&అమరావతి,
**శ్రీ సందీప్ మండవ,** సీఈవో, మాలక్ష్మి ప్రాపర్టీస్ ప్రై.లి.,
**కుర్రా జితేంద్రబాబు**
డైరెక్టర్, డెక్కన్ ఆర్కియోలజికల్ & కల్చరల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్
**డా.డి.సూర్యకుమార్,** శాసన పరిశోధకులు
**డా.అ.ఉమామహేశ్వరశాస్త్రి,డా.ఎస్.జై.కిషన్, గోళ్ళనారాయణరావు, డా.గుమ్మా సాంబశివరావు, డా.వెన్నా వల్లభరావు, శుభాకర్ మేడసాని, కలిమిశ్రీ, గిరిధర్ అరసవెల్లి, సోమయాజులు మలపాక, చందూ కార్తీక్** గార్లకు
నా కృతజ్ఞతలు.

**డా.ఈమని శివనాగిరెడ్డి - స్థపతి,** సీఈవో
ది కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ & అమరావతి
4వ అంతస్తు, మధుమాలక్ష్మి ఛాంబర్స్, మొగల్‌రాజపురం, విజయవాడ-10.
మొబైల్ : 9848598446, E. mail: drreddynithm@gmail.com

ix

# విషయసూచిక

## శాసనపద్యమంజరి ద్వితీయభాగము

**సంఖ్యలు**

| | | | |
|---|---|---|---|
| 1. | ౧ | 6. | ౬ |
| 2. | ౨ | 7. | ౭ |
| 3. | ౩ | 8. | ౮ |
| 4. | ౪ | 9. | ౯ |
| 5. | ౫ | 10. | ౧౦ |

# శ్రీ జయంతి రామయ్యపంతులు

శ్రీ జయంతి రామయ్య పంతులు గొప్ప పండితుడు. శాసన పరిశోధకుడు. ఆంధ్ర భాషోద్ధరణాభిలాషి. గోదావరిజిల్లా లోని కోనసీమలో గల అమలాపురంకు సమీపంలోని ముక్తేశ్వరం ఆయన స్వగ్రామం, జన్మస్థలం. శ్రీ జయంతి 1860, జూలై 18న జన్మించారు. తల్లి సోమమ్మ, తండ్రి రామయ్య. తెలుగువారికి తెలుగుదనానికి, ముఖ్యంగా తెలుగుభాషకు ఊపిరి అందించిన గొప్ప కవిపండితుడు జయంతి రామయ్యపంతులు. నేటితరం యువతకు బొత్తిగా జయంతి వారి పేరే ఎరుగని పరిస్థితి వుంది. మహాకవి నన్నయ్యకు పూర్వమే తెలుగు భాష వుందనీ తెలుగులో కవిత్వం రాశారని జయంతి రామయ్య రుజువు చేశారు. శ్రీ రామయ్య పంతులు పలు అరుదైన శాసనాలను వెలుగులోకి తెచ్చారు. ఐతే ఈ విషయాలు నేటితరంలో చాలా కొద్దిమందికే తెలుసు.

తెలుగు భాషోద్ధరణలో మహనీయుల నిరంతర శ్రమ, కృషి ఎంతో వుంది. అలాంటి మహనీయులను గుర్తుంచుకోవడం నేటి యువత తమ విధిగా భావించాలి. శ్రీ జయంతి రామయ్య పంతులు తెలుగుభాష పూర్వాపర విషయాలపై అనేక పరిశోధనలు చేశారు. పలు శాసనాలను వెలుగులోకి తీసుకొచ్చారు. తెలుగు భాషా పరంగా ఎన్నో చారిత్రక విషయాలపై జయంతిరామయ్య విశేష కృషి, పరిశోధనలు చేశారు. విశేషంగా విజయనగర చక్రవర్తుల విషయమై సంగమ వంశ రాజులకు, తుళువ వంశరాజులకు మధ్య సాళువ వంశరాజులు పాలించిన విషయాన్ని బహిరంగ పరిచింది జయంతి వారే. ఈ సంగతిని జయంతి వారు తన పరిశోధనల ద్వారా దేవులపల్లి శాసనంతో రుజువు పరిచారు.

అలాగే, విజయవాడ ప్రాంతంలో 'యుద్ధమల్లుని' శిలా శాసనం వెలికి తీసింది జయంతి రామయ్య గారే. యుద్ధమల్లుడు రాసిన తెలుగు పద్యాలను ఒక శిలా శాసనంలో ఉన్నవాటిని బహిరంగ పరిచాడాయన. ఆ మాదిరిగా యుద్ధమల్లుడు తెలుగులో మహాభారతం రాసిన నన్నయ్య భట్టారకుని కంటే పూర్వుడని తెలుగులోని మహాభారతం కంటే పూర్వం తెలుగు భాష వుందని సాధికారికంగా, సహేతుకంగా తెలుగువారి దృష్టికి తీసుకొచ్చాడాయన. ప్రాచీనాంధ్ర శిలా శాసనాలలోని పద్యాలను సేకరించి వాటిని క్రోడీకరించి 'శాసన పద్యమంజరి' పేరున రెండు సంపుటాలుగా ఆయన ప్రచురించారు. అలాగే, "దక్షిణ హిందూ దేశ శాసనములు" అనే గ్రంథాన్ని ఆయన ప్రచురించారు. శ్రీ జయంతి రామయ్య రాష్ట్రంలో జిల్లా మేజిస్ట్రేటుగా, ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుగా పని చేశారు. ఆయన వృత్తి రీత్యా ఎక్కడ పనిచేసినా,

సాయం సమయాల్లో తన కిష్టమైన సాహిత్య కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనేవారు. ఆ రోజుల్లో పిఠాపురం, బొబ్బిలి, వెంకటగిరి సంస్థానాధీశులు, తుని రాణి గారు, ఉయ్యూరు జమీందారులు తదితరులెందర్నో ప్రోత్సహించి వారి నుంచి ఆర్థిక సహాయం పొంది "ఆంధ్ర సాహిత్య పరిషత్తు" నొకదాన్ని ఏర్పాటు చేసి తద్వారా ఎన్నో ప్రాచీన శిలాశాసనాలను, సుమారు ఐదు వేల తాళపత్ర సంపుటాలను సేకరించారు. అలాగే, అనేకానేక అముద్రిత, అమూల్య గ్రంథాలను సేకరించి సాహిత్య పరిషత్తుకు అంద జేశారు. ఆంధ్రసాహిత్య పరిషత్తు తొలుత చెన్నైలో వున్నా, ఆ దరిమిలా కాకినాడకు తరలించారు. ఈ పరిషత్ పక్షాన ఒక పత్రికను కొంత కాలంపాటు నిర్వహించారు. ఈ పత్రిక ద్వారా ఎన్నో అమూల్య సాహిత్య సమాచారాన్ని ప్రచురించి వాటిని ప్రత్యేక గ్రంథాలుగా, సంపుటాలుగా తెలుగువారికి అందించిన ఘనత రామయ్య పంతులు గారికి దక్కుతుంది.

సంస్కృతం, తెలుగు భాషలలో గొప్ప పాండిత్యంతో పాటు, 1882లోనే డిగ్రీ పూర్తి చేసిన జయంతి రామయ్య 1884లో పిఠాపురం మహారాజా వారి స్కూలులో ప్రధానోధ్యాపకుడిగా కొంతకాలం పన్జేసారు. ఆ దరిమిలా - న్యాయ శాస్త్రం అధ్యయనం చేసి బి.ఎల్. పట్టా పొంది 1911లో జిల్లా మేజిస్ట్రేటుగా నియమితు లయ్యారు. బ్రిటీషు వారి పాలనలో ప్రముఖ న్యాయాధికారిగా స్థానిక ప్రజలందరికీ ఎనలేని సేవలందించారాయన. అంతేకాదు ఉత్తర రామచరితము, ముక్తేశ్వర శతకం, చంపూ రామాయణం, అమరుకము వంటి ఆధ్యాత్మిక గ్రంథాలను ఆయన రచించారు. 'ఆంధ్రవాఙ్మయ వికాస వైఖరి' అనే విమర్శనాత్మక గ్రంథం, ఇంగ్లీషులో "Defence of Literary Telugu, Dravidian Lexicography" వంటి పలు గ్రంథాలను ఆయన రాశారు. తెలుగు భాషా చరిత్రలకు సంబంధించి జయంతి రామయ్యా చేసిన పరిశోధనలు అనన్యసామాన్యం. గిడుగువారి వ్యవహారిక భాషావాదన పట్ల మక్కువ చూపక గ్రాంధిక భాషావాదిగా తనను తాను ప్రకటించుకున్నారాయన. తెలుగు భాషకు ఇతోధిక సేవలందించిన జయంతి రామయ్యా పంతులు గారు 1941 ఫిబ్రవరి 19వ తేదీన 81 సంవత్సరాల నిండు వయస్సులో స్వల్ప అస్వస్థతకు గురై తుది శ్వాస విడిచారు. తెలుగువారందరికీ ప్రాతఃస్మరణీయుడు జయంతి రామయ్యా పంతులు.

**డా.మల్లాది కృష్ణానంద్**

(మన తెలుగు పెద్దలు నుంచి)

# శాసన పద్యమంజరి

## పీఠిక

ఆంధ్రదేశమం దచ్చటచ్చట నున్న శిలాశాసనములందలి తెలుఁగు పద్యము లిందుఁ గూర్పఁబడియున్నవి. వీనిలో ననేకములు మాతృకలను బట్టి గాని వాని ప్రతిబింబములను బట్టి గాని నేను స్వయముగాఁ బ్రతివ్రాసినవియే. కొన్నిశాసనము లచ్చటచ్చట నిదివఱలో బ్రకటితములై యున్నవి. ఏయే గ్రంథములందు ముద్రింపఁబడినవో యవి యథా సందర్భముగ సూచించినాఁడను. ఇదివఱకుఁ బ్రకటింపఁ బడని శాసనములలో నేవియైన రాజకీయశాసనాధికారవర్గముచే సంభృతములైన శాసనములలోఁ జేరియున్నచో నాశాసనము లాశాసన వర్గమువారు ప్రకటించిన యేయేసంవత్సరపు పట్టికలలో నేయేసంఖ్య గలవిగా నున్నవో యదియు సూచించినాఁడను. ఇందు మొదటిశాసనము 770వ శకసంవత్సర ప్రాంతమునందును, చివరిది 1600వ శక సంవత్సర ప్రాంత మందును బుట్టిన వగుటచే నెనిమిది వందల సంవత్సరములకంటె నధిక మగుకాల మందుఁ బుట్టినపద్యము లిందుఁ గలఁ వని తేలుచున్నది. వీనిలో మొదటి శాసనము నన్నయభట్టారకుని ప్రభువగు రాజరాజనరేంద్రునికంటె నూటడెబ్బదిఎనిమిది సంవత్సరములు పూర్వము– అనగా శ.స.766 మొదలుకొని రాజ్యముచేసిన గుణగవిజయాదిత్యుని రాజ్యకాలమునఁ బుట్టినది. దానికి నించుమించుగా నేఁబది సంవత్సరముల పిదప రెండవ శాసనము పుట్టినది. కావున నీరెండు శాసనములును వాగనుశాసనకాలముకంటెఁ బూర్వము పుట్టినవే. ఈనాఁటిమండలముల వరుసనుబట్టియే యేయేమండలములలో నెన్నెన్ని శాసనములు దొరికినవో యీక్రింది పట్టికవలనఁ దెలియఁదగు.

| | | |
|---|---|---|
| గంజాము | ... | 1 |
| విశాఖపట్టణము | ... | 1 |
| గోదావరి | ... | 11 |
| కృష్ణ | ... | 17 |
| గుంటూరు | ... | 52 |
| నెల్లూరు | ... | 1 |
| కర్నూలు | ... | 1 |
| కడప | ... | 2 |
| గోలకొండదేశము | ... | 2 |
| | | 88 |

మొత్తము పద్యములలో ముప్పాతికకు మించి కృష్ణాతీరమందు దొరికినవి. పూర్వ కాలమందు, కృష్ణాతీరమందుఁ గవులెక్కుడుగా నున్నట్లు దీనివలనఁ దెలియుచున్నది.

ఈపద్యములవలని ప్రయోజనములు రెండు విధములు. దేశచరిత్రము తెలిసికొనుట యొకటి, ఆంధ్రశబ్దలక్షణమును ఛందస్సును గాలక్రమమున నెట్లు మాఱియుండునో యదితెలిసికొనుట యొకటి. భారతాది ప్రాచీనగ్రంథములు కూడ భాషాచరిత్రశోధన కుపయోగించునవియే కాని యవి పుట్టినవి పుట్టిన ట్లిప్పటివారికి లభించుటలేదు. కవులు వ్రాసిన మాతృకలు చిరకాలము క్రిందటనే నశించిపోయి... వానిని బట్టి యాయా కాలమువారు వ్రాసియుంచిన ప్రతులలోఁ జిట్టచివరవియె యప్పుడు దొరుకుచున్నవి. పాండిత్యాభావముచేత నేమి పాండిత్యముండియుఁ బ్రాచీన ప్రయోగములు తప్పులనుకొని సవరించుటవలన నేమి కేవలప్రమాదముచేత నేమి ప్రతులువ్రాసినవారచ్చుట్టుటఁ బాఠముల దిద్దుచుండిరి. లిఖిత ప్రతులలోఁ బాఠాంతరములుండుటయే యిందులకు నిదర్శనము. ఇట్లు మారియున్న గ్రంథములం బట్టి కవిప్రయుక్త పాఠముల నిర్ణయించుట శ్రమసాధ్యము. ఈ శాసన పద్యము లన్ననో కవులజీవిత కాలములో నెట్లు లిఖింపఁ బడినవో యట్లే మనకు లభించుటచేఁ గవిప్రయుక్త పాఠనిర్ణయమున కత్యంత ప్రబల సాధనములుగా నున్నవి. ఈ విషయములో నేమి యితరవిషయములలో నేను వీనిప్రామాణ్య మేమాత్రమును జెడకుండుటకై పద్యపాఠములు తూచాలు తప్పకుండ నున్నవి యున్నట్లే ముద్రింపఁబడినవి. ప్రమాదముచే నెక్కడనయిన నొక్క పాఠము తప్పి యుండిన నుండునేమో కాని తప్పకుండ నుండవలయుననియే సర్వప్రయత్నములు చేసినారము.

ఈపద్యములం దయినను గవ్యుద్దిష్టములు కానిపాఠములు కొన్ని ప్రవేశించి యుండఁ గూడదా యన్నచోఁ బ్రవేశించి యున్నవని యొప్పుకొనక తప్పదు. లేఖక ప్రమాదజనిత దుష్టప్రయోగము లనేకము లచ్చటచ్చటఁ గన్పట్టుచున్నవి. ఆపాఠము లున్నవి యున్నట్లే మూలమందుంచి వానిని సవరించువిధ మాయాపుటలయం దడుగున సూచింపఁబడినది.

ఇవి గాక కవిప్రయుక్తము లనఁదగిన పాఠములలోఁ గూడ వర్ణక్రమమునందును శబ్దలక్షణమందును నిప్పటి సదాచారమునకు విరుద్ధము లయిన ప్రయోగములు కొన్ని కనఁబడుచున్నవి. ఇవి కూడ లేఖక ప్రమాదజనితములే కాఁగూడదా యన్న నట్లు కానేరదని చెప్పవలసియున్నది. వివిధ కాలముల వివిధ దేశములందుఁ బుట్టిన వివిధ శాసనము లన్నింటిలో నొక్కవిధముగా నున్న ప్రయోగము లాయా కాలములందు జన సామాన్య సమ్మతము లయినవే గాని యాయాయి లేఖకులు కల్పించినవి కావని చెప్పక తప్పదు. అట్టి ప్రయోగములలో ముఖ్యమైన వీక్రింద వివరింపఁబడుచున్నవి. వీనిలో I. వర్ణక్రమమునకు సంబంధించినవి కొన్ని, II. శబ్దలక్షణమునకు సంబంధించినవి కొన్ని.

## I. వర్ణ క్రమసంబంధములు

1. అనుస్వారస్వరూపమును గుఱించి ముందుగా విచారింతము. అనుస్వారము తెనుఁగులోఁ బూర్ణ మనియు నర్ధ మనియు రెండువిధములు. నిండుసున్న పూర్ణానుస్వారరేఖ. అఱసున్న యర్ధానుస్వారరేఖ. శాసనములందుఁ గాని పూర్వపు వ్రాతపుస్తకములందుఁ గాని యఱసున్న యెచ్చటను గానరాదు. అది యుండవలసిన చోటఁగూడ నిండు సున్నయే కనఁబడుచున్నది. ప్రాచీన శాసనములలో నిండుసున్నకు బదులు వర్గాంత్యానునాసికాక్షరములు కనఁబడుచున్నవి. అనగా కట్టిఞ్చి, తమ్ముణ్డు, అన్తయేనియు, ఫలమ్బు, ఇత్యాది రూపంబులు కనఁబడుచున్నవి. దీనిని బట్టి చూడఁ గాఁ దెలుఁగులో ననుస్వారమని వాడఁబడుచున్నది వర్గాంత్యానునాసికాపరరూప మనియు, అది తొలుత ననునాసికాక్షరముగానే వ్రాయఁబడుచుండి కొంతకాల మైన పిదప సౌకర్యార్థము బిందురూపముగా వ్రాయఁబడెననియు, ఆబిందువు తొలుతఁ బూర్ణముగానే యుచ్చరింపఁబడి రాను రాను లాఘవార్థము దీర్ఘముమీఁద నిత్యముగాను హ్రస్వముమీఁద నైకల్పికము గాను దేల్చి పలుకఁబడసాగె ననియు దీనివలననే పూర్ణార్ధానుస్వారభేద మేర్పడియె ననియుఁ దేలుచున్నది.

2. శాసనములలోఁ గొన్నిచోటుల వ్రాఁత యొకవిధముగాను బలుకుబడి యొక విధముగాను గనఁబడుచున్నది. ఉదాహరణము:-

(క) రెండవశాసనములో "నెగి దీచ్చెఁ మఠంబు" (2 వ పద్యము) "అశ్వమేధంబు

ఫలంబు" (3 వ పద్యము) అనుచోటుల మఠము, ఫలము అని చదువవలయును. లేకున్న ఛందోభంగమగును. మఠశబ్దమునకు మఠంబు, మఠమ్ము, మఠమునని మూఁడు రూపములున్నవి. అందు మఠంబు అనునదియే మొదటి రూప మయినట్లును అది మాఱి మఠము అయినట్లును, అది తేలిచి పలుకుట చేత మఠము అయినట్లను గనఁబడుచున్నది. పలుకుబడి యీవిధముగా మాఱినను వ్రాఁతమాత్రము మఠంబు అనియే కొంత కాలమువఱకు నుండెను. మఠము అనురూపము గ్రంథములందుఁ గానవచ్చుచున్నది, గాని, శాసనములం దంతగాఁ గనుపడుట లేదు, ప్రాసార్థము కవులారూపము నంగీకరించియుందురు.

(చ) మూఁడవ శాసనములో "బురుడించ్చు నట్లు" అనుచోట "బురుడించునట్టుల" అనియు నాలుగవ శాసనములో "శ్రీశకునేణ్డు" అనుచో "శ్రీశకునేణ్డులు" అనియుఁ దొమ్మిదవ శాసనములో "ఇష్ట కు" అనుచోట "ఇష్టులకు" అనియు "గుడ్లకు" అన్న చోట "గుడులకు" అనియు, నిరువదియొకటవ శాసనములో "చెఱ్వు" (2 వ పద్యము) అనుచోట ''చెఱువు'' అనియుఁ జదువవలయును. ఈజంట రూపములం దసంయుక్తరూపములే పూర్వరూపములు. సంయుక్త రూపములు తరువాత వచ్చినవి. అయినను వాని కొకానొకప్పు డసంయుక్తోచ్చారణమే చెప్పవలసియున్నది. సంక్లిష్టములుగా నుండవలసిన యక్షరములు కొన్ని తావుల విడిగా వ్రాయబడినవి. ఉదా:-నిలిపె (39 వ శాసనము)

(ట) ఋకారమునకు బదులుగా ఇకారసహిత రేఫమే ప్రాచీన శాసనములలోఁ గనఁబడుచున్నది. ఉదా:-బ్రింద, వ్రిక్షము, మ్రిగాంక (10 వ శాసనము) సమ్రిద్ధి (41-6). ఒకానొకప్పుడు "నృ" అనుదానికి బదులుగా "ంద్రి" అనురూపము కనఁబడుచున్నది. ఉదా:- సూంద్రిత (41-2) సకంద్రి పావనీ పాల (41-13).

త) పాదాంతములందుఁ గేవలము హల్లుగా నుండవలసిన నకార లకారములు సాధారణముగా అజంతములుగానె కనఁబడుచున్నవి. అచ్చునకుఁ బలుకుబడి లేదు. ఒకానొక చోట నకారము పొల్లు రూపమును గలదు. ఉదా:- అర్థిౘ (2-1) హేతిచేౘ (52-2) పదమధ్యమందుఁగూడ హల్లుమాత్రముగానే యుండవలసిన నకారలకారము లచ్చుతోఁ గూడి కనఁబడుచున్నవి. ఉదా:- శకాబ్దములు (55-5) దుర్వ్యౘవసాయులను (7-4) భంగదులు (12-4).

(ప) ఐ కి మాఱుగా, అయి, అయికి మాఱుగా, ఐ, తఱచుగా వ్రాయబడినవి.

(గ) అనుస్వారపూర్వకాక్షరము పెక్కు తావుల ద్విగుణీకరింపఁబడినది. అట్లు కానిచోటులునుం గలవు.

(జ) సంయుక్తాక్షరములలో రేఫపరక మగునక్షరము తఱచుగ ద్విగుణీకరింపఁ బడినది. ఉదా:-కర్త్తృ (58-2) ధమ్మ్మంబు (58-3).

డ) క్రావడియుండవలసినచో శకట రేఫముండుట. ఉదా:- వణ్ణె(1) చెబ్ఱోలనుణ్డి (2-4).

(ద) ...స్సి, అ...సిన (2-3) ఇత్యాది శబ్దములందు ... యను వింతయక్కర మొక్కటికనఁబడుచున్నది. ఇది యఱవములోని ..., కన్న డములోని ... యనునక్షరము లకు సజాతీయమైనది. దీనియుచ్చారణ మిప్పుడు డకారోచ్చారణముగా మాఱినది. ఈ యక్షరమును గూర్చిన విమర్శన మాంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ గననగు.

పైనుదాహరింపఁబడిన వర్ణక్రమ దోషముల నన్నింటిని సవరించినచో గ్రంథవిస్తర మగునని విడిచిపెట్టినారము. పాఠకులు యథోచితముగ సవరించుకొనవలయును.

## II. శబ్దలక్షణమునకు సంబంధించిన ప్రయోగవిశేషములు-

1. సంస్కృత శబ్దములు కొన్నింటికి లక్షణవిరుద్ధములైన రూపములు. కనఁ బడుచున్నవి.

(క) కల్హారగంధి యనుటకు బదులుగా కలుహారగంధి యని (15-3).

(చ) కమల నేత్రి (3-1) వనజ నేత్రి (4-1) విశాల నేత్రి (5.5) అంభోరుహనేత్రి (15-3) ఇత్యాది స్థలములందు నేత్ర యనుటకు నేత్రియని ప్రయోగించుట.

(ట) వల్లభ యనుటకు బదులుగా వల్లభి యనుట (4-1, 5-3)

(త) బాలిక యనుటకు బదులుగా బాలకి యనుట (5-5)

(ప) ఉదయించె ననుటకు బదులుగా ఉదియించెనని తఱచుగాఁ గన్పట్టుచున్నది.

(గ) అకారాంతశబ్దములకు డుప్రత్యయము పరమైనప్పుడు ప్రకృతిరూపమందలి చివరియకారమున కుకారము రాకుండుట- బ్రహ్మదేవండు (40-3,5) శరణండు (46-14) భీమనిృ (48-2) మల్లి దేవండు (58-12,13).

2. డుప్రత్యయంత శబ్దములు కొన్ని డుప్రత్యయము లేకయే కనఁబడుచున్నవి. చోడుఁడు అనుటకు బదులు చోడు (58-7) తమ్ముఁడు అనుటకు బదులు తమ్ము (58-15, 16)

3. నన్నయ భట్టారకుని కవిత్వమందుఁ గల ప్రయోగవిశేషములు కొన్ని యీ శాసనములందుఁ గనుపట్టుచున్నవి.

(క) "అందు" నకుఁ బ్రయోగవిశేషము.(16-6)

(చ) ప్రథమకు బదులుగా షష్ఠీవిభక్తి ప్రయోగము. నీపడసిన (9) వెలనాంటిచోడ నృపునిచ్చిన (42-1)

(ట) అస్వమేధంబున ఫలంబు (1)

4. కళల పై వచ్చు కచటతపలకు గసడదవాదేశము సాంస్కృతికములందు సైతము తఱచుగాఁ గనఁబడుచున్నది. ఈయాదేశము నిత్యమనియే పూర్వులు భావించినట్లు కనుపట్టుచున్నది.

**ఛందోవిషయము.**

1. రెండవ శాసనములోని మధ్యాక్కరలలో యతి ప్రతిపాదమునందు నైదవ గణము మొదటఁ గనఁబడుచున్నది. నన్నయభట్టారకుని కవిత్వమందు నిట్లే యున్నది. కవి జనాశ్రయమునందుఁ గూడ నిట్లే విధింపఁబడియున్నది కాని యిటీవలి కవిత్వ మందు నాలుగవగణము మొదటఁ గనఁబడుచున్నది. అప్పక వ్యాదులగు లాక్షణికులు నిట్లే నిబంధించినారు.

2. మొదటి శాసనములో "గొళల్చి" యనుచోటను, రెండవ శాసనములో "గొరగల్గా కొరు లిందు" అను చోటను లకారము విడిచి యుచ్చరింపవలయును. ఈసంప్రదాయము కన్నడములో నక్కడక్కడఁ గలదు.

ఇంతకంటే ఛందస్సులో విశేషము లగపడవు.

వర్ణ క్రమమందుఁ దప్ప నితరవిషయములందు శాసనపద్యభాషకును నేఁటి పద్యభాషకును భేద మంతగాఁ గనఁ బడదు. ఆనాఁటికే భాషాలక్షణము చాలవఱకు స్థిరపడి యున్నది.

పద్య సంజ్ఞలును పద్య సంఖ్యయు మేము చేర్చినవి గాని మాతృకలోనివి కావని గ్రహింపవలయును. ఒక్కొక్కచో మాతృకలో కందం, వ్రిత్తం అని యున్న చోటులు చూపింపఁబడినవి.

**- జ. రామయ్య**

## శాసన ప్రతిబింబము

పండరంగుని అద్దంకిశాసనము



# శాసన పద్యమంజరి

## 1. అద్దంకి

శ. స ೭೭౦ ప్రాంతము.

(ఈశాసనము గుంటూరు మండలమునందు అద్దంకి గ్రామమున నొక పొలములో నున్న ఱాతిమీఁద చెక్కబడియున్నది. శాసనము పైభాగము కొంతయు నడుగుభాగము కొంతయు శిథిల మైపోయినది. Epigraphia Indica Vol. XIX)

తరువోజ,

పట్టంబుగట్టిన ప్రథమంబు నేణ్డు
బలగర్వఁంబొప్పంగ బైలేచి[1] సేన
పట్టంబు గటిఞ్చి ప్రభుబణ్డరంగు[3]
బఞ్చిన సమత్త[4] పడువతో బోయ
కొట్టంబు ల్వణ్డెణ్డు గొణి[5] వేంగి నాణ్టిం
గొళల్చి[6] యాత్రి భువనాంకుశ బణ[7] నిల్పి
కట్టెపుదుర్గఁంబు గడు బయల్సేసి.
కణ్డుకూ ర్బెజవాడ[8]గావిఞ్చె మెచ్చి.

పణ్డరంగు పరమమహేశ్వరుణ్డు ఆదిత్యభటారనికి[9] ఇచ్చిన భూమి యెనుబొదివుడ్ల ఆడ్లపట్టు[10] నేల దమ్మవురంబున దమ్మువులు వీని రక్షిఞ్చినవారికి అస్వమేధంబున పలంబు[11] అగు.

---

1. బొప్పంగం బై లేచి - అనిచదువునది.
2. గట్టిఞ్చి ”
3. ప్రభుం బణ్డరంగుం ”
4. సామంత ”
5. కొట్టము ల్పణ్డెణ్డు గొని ”
6. గోళచి- అని యుండనోపు.
7. త్రిభువనాంకుశమున - అని చదువునది
8. కందుకూ ర్బెజవాడ ”
9. భట్టారకునకు ”
10. వుట్లుళ్లపట్టు ”
11. అశ్వ మేదంబునఫలంబు ”

## 2. బెజవాడ

శ. స. ౮౨౦ ప్రాంతము.

(ఈశాసనము బెజవాడ గ్రామముందు మల్లేశ్వరస్వామి యాలయములో నొకఱాతి మీఁదమూఁడు ప్రక్కలను చెక్కఁబడియున్నది. Epigraphia Indica Vol. XV)

మధ్యాక్కర.

స్వస్తి నృపాంకుశాత్యన్తవత్సల సత్యత్రిణేత్ర
విస్తరశ్రీయుద్ధమల్లు ణ్డనవద్యవిఖ్యాతకీర్త్తి
ప్రస్తుత రాజాశ్రయుణ్డు ద్రిభువనాభరనుణ్డు సకల
వస్తుసమేతుణ్డు రాజసల్కి భూవల్లభుణ్డర్త్తిఁ[1] 1

పరగంగ బెజవాడ గొమరస్వామికి[2] భక్తుణ్డై గుడియు
నిరుపమమతి నృపధాము ణ్ణెత్తించ్చె నెగి దీచ్చెఁ మఠంబు[3]
గొరగల్గా కొరు[4] లిన్దు విడిసి బృన్దంబు గొని యుణ్డువారు
... రిగాక యబ్బారణాసి వ్రచ్చిన పాపంబు గొణ్డు... 2

నెలయంగ నియ్యొట్టు ...స్సి మలినురై విడిసిన వ్రోల[5]
గలతానపతులును రాజు పట్టంబు గట్టినపతియు
నలియం బయ్వారల[6] వెల్వఱించిన నశ్వ మేధంబు
ఫలం బు[7]పేక్షించిన లింగం బఱిసిన[8] పాపంబు దమకు 3

---

1. వల్లభుణ్డర్థి- అని చదువునది.
2. గోమరసామికి ”
3. మఠము ”
4. ఇక్కడ “గొరగల్గాక” అనుచో లకారము తేల్చి పలుక వలయును.
5. విడిసినం బ్రోలం అనిచదువునది.
6. నలియంబైవారల ”
7. ఫలము ”
8. మఱిసిన ”

జననుత చేబ్రోలనుణ్డి బెజవాడ జాత్రకు[9] వచ్చి
త్రిణయనుసుతు ణ్డొణ్డసోటు మెచ్చక తివిరి యిన్నెలవ
యనఘుణ్డు సేకొని యిన్దు ప్రత్యక్ష బయన్న నిచ్చ[10]
గని మల్లణ్డెత్తించె గుడియు మఠంబునుం[11]గార్త్తికేయునకు.

దీనిం జేబ్రోలు యేలెడు (వా) రతిరం బేలు (వా) రోణ్డసోటి ...రగ(లు)ను బెట్టు వేరుగను జ(ను)యిాస్థితి సేకొణి కాచు (వా)ర....న్దారు నిల్పినవారు (స్థి)తిడప్పి యటిపుట వా(పం)బుగాన.

మధ్యాక్కర

రమనతో[12] బెజవాడకెల్ల బెడంగును రశ్రీయుంగాను
న్దమతాత మల్లపరాజు వేరెయు దానుం గట్టించెం
గ్రమమున[13] దానిక కలశ బిడ్డటు[14] గా మొగమాడు
నమరంగ శ్రీయుద్ధమల్లు ణ్డెత్తించె నమిత తేజుండు
తనధర్మ్మ వొడంబడి కాచునృపులకంద్ద-

(అసంపూర్తి)

---

9. జాతరకు-అనునది సాధురూపము
10. ఇందుం బ్రత్యక్షమై యున్ననిచ్చం-అని చదువునది.
11. మఠమును అని చదువునది.
12. రమణతో ”
13. గ్రమమున ”
14. మిడ్డట్లు ”

## 3. ద్రాక్షారామం

శ. స. ౯౮౭

(ఈశాసనము గోదావరిమండలములో ద్రాక్షారామం గ్రామముందు భీమేశ్వరాలయ మున నొకఱాతి పలకమీఁద చెక్కఁబడియున్నది. Epigraphia Indica Vol. IV.NO. 1007)

శ్లో॥ శాకే సంవత్స రేషమున్ని (వ)సునిధిగే రాజమార్త్తణ్డభూ××
తు్ప(త్రీ)సా...నేత్రీకనకరచితం కల్పభూజాతపుష్పం
ప్రాదాద్భీమేశ్వరాయ వ్యదిశ దథ సదా దీప్యదాచంద్రతారం××
దీపం రౌప్యం చ పాత్రం బిససదృశ భుజా రేవి దేవీతనూజ××

సీ॥ శ్రీవిష్ణువర్ధనభూవిభుదయ భూమి
దేవిం బోల్ రేవల దేవి కనిన
సోమలదేవి గుణారామ[1] జగదేక
సున్దరి మత్తేభ మందగమన
దొల్లి భీమేశ్వరవల్లభునకు సిత
మణిబనథ మిచ్చె సన్మణియుతముగ
నురువిచ్చె గంగనా బరువడి వినివారిం[2]
బురుడించునట్ల[3] సరసిజాస్య
గనకరచితరుచికరకల్పావనీరుహ
కుసుమమిచ్చెం దనకునసము వెరుగ
వెణ్గిమణ్డతో నఖణ్డితద్యుతి దీప
మమరనిచ్చె విమలకమలనేత్రి.

---

1. ఇచట యతి తప్పినది. శ్యామలదేవి అనిన సరిపోవును గాని, సీసమందెల్లడఁ బ్రాసయతియే కనఁబడుచుండుటచే నాపాఠము కవిసమ్మతము కాదేమో యను సందేహాయు కల్గుచున్నది.

2. వినువారిం-అని యుండనోపు.

3. నట్టుల- అని చదువవటయును.

వె. సకల వసుమతీశమకుటలసద్రత్న
కిరణరుచివిరాజితచరను ణ్డయిన
నిజభుజప్రధాని బెజయిత దేవని
కూంతుసరియ[4] పోల్పం గాంత లెందు
-లిఖితం పెద్దనాచార్యుః

4. సరియగునా-అని అర్థము.

## 4. దీర్ఘాసి

శ. స. ౯౯౭

(ఈపద్యములు గంజాముమండలములో దీర్ఘాసి యను గ్రామమున "దుర్గమెట్ట" మీఁద నొకఱాతి పలకమీఁద చెక్కఁబడియున్న శాసనము చివర నున్నవి. శాసనపూర్వభాగ మంతయు సంస్కృతమున నున్నది. Epigraphia Indica Vol. IV)

సీ॥ శ్రీశకునేణ్డు[1] భూపతిపై శైల
నన్దాబ్జ భవసంఖ్య నొంది వేంగి
దేశంబు గిమిడియ గోసల గిడ్రిసింగి
దేశంబు మఱియొడ్డ దేశ మనంగ
జనిన హూపాలుర ననినొచ్చె[2] చలమర్తిఁ
గణ్డణ్డ నెగడిన మణ్డలికుణ్డు
భూసుర వంశుణ్డు వాసవనిభభోగి
బణపతి సౌజన్యగుణయుతుణ్డు
దీర్ఘాసి భగవతిదేవి దేవాలయ
మున ముందటం గడుఘనతరముగ
మణ్డపమెత్తించె భణ్డనవిజయుణ్డు
గణ్డగోపాలు డఖణ్డకీర్తిఁన్
దీనియ వెట్టె నద్దేవికి నవ్వేలం
దనమనోవల్లభి వనజనేత్రి
దీవియ వెట్టెం బద్మావతియును క్షోణి
నశశులు[3] గలయంతకును ముదమున

---

1. నేణ్డులు–అని చదువవలయును.
2. నోచ్చెన్– అని యుండవలయును.
3. క్షోణి యినశశుల్– అని యుండవలయును.

గగనభూమిచంద్రఖరకరోదశిఖ
మారుతాత్మమూర్తి మహిషమధన
యిష్టపూర్త[4] ఫలము లెల్లకాలంబును
మెచ్చుతోడం దమకు నిచ్చుచుణ్డ.

4. యిష్టాపూర్త ఫలములు అనునది సాధురూపము.

## 5. అమరావతి

శ. స. ౧౦౩౦

(ఈ శాసనము గుంటూరుమండలములో అమరావతీ గ్రామమందు అమరేశ్వర స్వామియాలయమునందు పెద్దమండపము దక్షిణపుగోడలోఁ గట్టఁ బడియున్న యొక ఱాతిమీఁద చెక్కబడియున్నది. South Indian Inscriptions Vol. VI. No. 240.)

ఉ. శ్రీరమణీయ్యు ఙ్డర్ధిజన సేవ్యుణ్డు భవ్యుణ్డు దివ్యమూర్త్తి శౌ
య్యార్యరభ(టీధుతా?)తినిశితాశివిదారితశత్రువర్గ్గణ్డా
ధారిత బన్ధుమిత్ర (జ)న తామణి గొంక్కనరేంద్రమంత్రి(ప్రో)
త్సారితలోభ మోహ వ్రితసత్వ్యుణ్డు (ప్రోలణ్డు) ధన్య్య ణ్డున్నతిని. 1

క. శ్రీరాజప్రోలిశాసను
ణ్డా రాధితనీలకణ్ఠు ణ్డ(భి)నవమదనా
కారుణ్డు ప్రోలణ్డు విబుధా
ధారుణ్డనం బొన్న రాంబతనయుణ్డు నెగడెను. 2

క. ఆతనివల్లభి గొమ్మమ
మాతంగ్గమరాలయాన మనసిజురతివి
ఖ్యాతయశోనిధి గొంక్కమ
హీతలపతి కరుణ లక్ష్మి నెంత్తయు వెలసెను. 3

ఉ. చారువిశుద్ధవంశదధిసాగ(ర)సంభవి తేంద్దులేఖ ల
క్ష్మీరుచితాంగ్గ(భాతి) నుపమింప్ప సతీత్వగుణ ప్రసిద్ధిమెయి[1]
నారయ సెజ్జప్రోలనికులాంగ్గన గొమ్మమ మేలు సీతకును
వారిజబన్ధుకాంత్తకును వాసవుకాంత్తకు లక్ష్మి దేవికిని. 4

ఉ. అంబరమూర్త్తిఖేందుమితమై సక[2] వత్సరములు సనంగ్గ భూ
మ్యంబుదివాకరాత్మ కల యంత్తకు భక్తి నఖణ్డమైన దీ
పం బమరేశ్వరార్ద్ధముగ బాలకి లోలవిశాలనేత్రి గొ
మ్మాంబిక నిల్పె భక్తిమతియై యెఱియాంబతనూజ ప్రీతితోను. 5

స్వస్తి సమస్త ప్రశస్తిసహితం శ్రీమన్మహామణ్డలేశ్వర కులోత్తుంగ్గ చోడగొంక్క రాజుల దివ్యశ్రీపాదపద్మోపజీవియైన సెజ్జప్రోలెనాయకుని పెణ్డము విణ్ఠల కొమ్మాసాని శ్రీమదమరేశ్వరమహాదేవర కాచంద్రార్క్కతార మఖణ్డవర్త్తి దీపంబున కిచ్చిన గొఱియలు ౫౫ ॥.

(ఇత్యాది)

---

1 మై-అని చదువవలయును. 2. శక-అని చదవవలయును.

## 6. చే(బ్రోలు

శ. స ౧౦౪౦.

(ఈశాసనము గుంటూరుమండలములో చే(బ్రోలు(గ్రామమందు తురక వీథిలోఁ బడియున్న రాతిమీఁద చెక్కబడి యున్నది. South Indian Inscriptions Vol. VI. No. 117.).

సీ. శకమహీపాలక సంవ(త్స)రంబులు
గ)గనాబ్ధివి(య)దిందు(గణ)నం దనర
వడి ... ... ... న్వరంబున మహా
ద్వాద(శి)తిథి నుదితోదయుణ్డు
.... ... .... సూద్ర కప్రభృతులతోడి
కులమువాడను కలితనమువాడు
మ(ణ్డ)భూపాలకు మహనీయ్య[1]సాం(బ్రాజ్య[2]
రాజ్యాభివృద్ధిపరా(య)నుండు సూరం
ద(తులశౌర్య్య) సారుణ్డు సేంబ్రోల
బర్హివాహనునకు భక్తి వెల(య)
... ... ... నఖణ్డదీపంబు నిల్పె నా
చంద్ర తారకముగ రుం(ద్రయశుణ్డు. 1

1. మహానీయ. అనిచదువవలయును. 2. సామ్రాజ్య- అని చదువవలయును.

## 7. చేబ్రోలు

శ. స. ౧౦౪౦.

(ఈ శాసనము గుంటూరుమండలములో చేబ్రోలుగ్రామమందు తురక వీధిలోఁ బడియున్న రాతిమీఁద చెక్కబడియున్న మఱియొక శాసనము. ఇందు కాలము సూచింపఁబడ లేదు గాని 6వ సంఖ్య శాసనము నిదియు నొక్కనివే. ఒక్క రాతిమీఁదనే చెక్కఁబడియున్నవి. South Indian Inscriptions Vol. VI. No. 117)

క. శ్రీరమ(ణీయు)ణ్డు గులని
స్తారకుణ్డున ... ... వ్యచంద్రు(ణ్డు) సుజ(నా)
ధారుణ్డు గన్న యపుత్రుణ్డు
సూరణ్డు(సూ)...పత్తికొణ్డసూరక పేమ్రిఁని. 1

చ. జితరిపు(బే)తమలిక సంఘము[1] జేగిరి[2] పశ్చిమ(ంబు)న
పతి యగు (నె)ఱ్ఱమఱ్ఱ జన పాలకులేశ మహాప్రధానిక
స్థితియును నం(ద)లంబును విశేషవిభూతియుం (బే) మ్రిఁతోడ ప్ర[4]
స్తుత(మ)గుచుండ్డం గండ దనిసూర(ణ్డు)పౌరుషధర్మఁ సార్హుణ్డె. 2

చ. తన ......లోక విదితంబుగా బ్రోచిన[5] పణ్డధరుణీ[6]
జనపతిమస్తవంబున[7] బ్రిశస్తితి[8] నబ్బెజవాడ నన్యసా
ధనసుభటావలిం దున్మి[9] తమ్ములు దానునుం బోరిలోనం బే
క్మోఁని గెలిపించె నా(డు) నధికుణ్డగుసూరణ్డు శౌర్యుఁ సార్హుణ్డె. 3

ఉ. బిరుదుమాడలుం[10] జైన దెపెడ్డు(ను)నింత్తియ కాని (త)మ్ములో
పారయ లేనిపందల దురాత్ముల దుర్వ్యాఁవ[11]సాయులను దురా
చారులం జెప్ప నేణ్టికి లసగ్గుణధీరు ... ... ... వీరదు
ర్వాఁర(ణు)విస్వకర్మఁ[12]కులవల్లభు సూరనిం జెప్పు ణ్డిమ్మహిని. 4

చ. అనుపమసాహసస్ఫురన[13] నర్మఁ మెయిం దలపోయ నా(ళిం?) బే
క్మోఁని కదువీరులై నెగడుకున్నలు బొందలతోడియాదనం

జనునసహాయసాహసరసప్రియు మణ్డమహీత లేశుక
ట్టనుంగు నుదగ్ర శౌర్య్య సుభటాగ్రణిం బ్రోలమవుపుత్రుసూరణిని. 5

ఉ. రాజవిభూషణుణ్డు సురరాజవిలాసు ణ్డనస్తకీర్త్తి వి
భ్రాజితుం డెల్లమణ్డజనపాలకునచ్చిన వజ్రదండగ
న్నో జుసుతుణ్డు సూరని మహోర్వ్వీవసన్నిధిం చెక్కు రాజస
త్పోజితు విశ్వకర్మ్మకులభూషణు వైరినరేంద్ర భీషణున్. 6

చ. గొడుగులు నందలంబును నగు(వ్వ)గుచున్న మహావిభూతియుం
బ్బడసెను[14]విశ్వకర్మ్మముని బావతివల్లభుచేత విద్య మెయి[15]
గొడుగులు నన్దలంబును నగువ్వగుచున్న మహావిభూతియుం
బ్బడసెను[14] నెల్లమణ్డజన పాలకుచేతను సూరం దమ్మ మైయి[16] 7

క. శ్రీపర్వ్వతంబు చుట్టునుం
జేపొప్ప(ం)గ(0) బహిడతీవసనుం[17] గీర్త్తి
శ్రీపతి యగురిషిమన్మ
ణ్డాపున ... ... ... స్వర ... ... ... ణ్డనంగా. 8

---

1. సింహము- అని చదువవలయును.
2. శ్రీగిరి- అని యుండనోపు.
3. పశ్చిమంబునం బతియగు- అని చదువవలయును.
4. తోడంబ్ర - అనిచదువవలయును.
5. తంబుగంబ్రోచిన - అని చదువ వలయును.
6. ధారుణీ ”
7. సంస్తవంబున- అనియుండనోపు.
8. భృశస్థితి- అని చదువవలయును.
9. దునిమి ”
10. మొదట గణముతప్పినది.
11. దుర్వ్యవసాయు- అనిచదువవలయు.
12. విశ్వకర్మ- ”
13. స్ఫురణ- ”
14. బడసెను అని చదువవలయును.
15. మై - ”
16. మై- ”
17. ఇచ్చట ఛందోభంగము కలిగినది. అన్వయము కుదురుట లేదు.

## 8. బెజవాడ

శ. స. ౧౦౪౬.

(ఈ శాసనము కృష్ణా మండలములో బెజవాడ గ్రామమందు ఇంద్రకీల పర్వతము క్రిందిభాగమున ఖిలమయియున్న మండపములో నొకఱాతి స్తంభము మీద చెక్కఁబడి యున్నది. మొదటి ౧౧ పంక్తులు వచనము. దాని తరువాత నొక కందపద్యమును నొక వచనమును గలవు. అవి చాలవఱకు శిథిలమైనవి. తరువాత నీ క్రిందిపద్యము లున్నవి South Indian Inscriptions Vol. IV. No. 737)

ఉ. ఆతనితమ్ముఁణ్డన్వయ వియత్తలమిత్రుణ్డ సేష[1]దిక్తట
ఖ్యాతయశోర్త్తిఁ[2] భీమ(ణ్డు) సుఖస్థితి రాజై[3] యబ్ధివేష్టిత
క్ష్మాతలనాధు లెల్ల సరిగాపులమాడ్కిన తీఱువెట్ట మాం
ధాతయయాతి వేణుప్రిగధర్మ్మఁజుల ట్ల[4] ప్రగల్భుండై . 1

గీ. పరమహీశులు భక్తులై బంప్పం బనులు
సేయు చుణ్డంగ్గం దపనురస్మి[5]యును గాద్పు
చొచ్చినచ్చోన తన యాజ్ఞ సొ(చ్చి) వెలుంగు[6]
భూమి యెల్లను బంగెనభీమ ణ్డే లె. 2

స్వస్తి సమస్త భువనాశ్రయ రాజాధిరాజ రాజపరమేస్వర పరమభట్టారక రవికులతిలక సత్యాశ్రయవం(స్య) చాలుక్యాభరణ శ్రీ త్రిభువనచక్రవర్త్తిఁ శ్రీమత్పెర్మ్మఁ నడి దేవర దివ్యసహస్ర వర్షఁంబులు ౪౬ గు శాహి శ్రీ వేంగిదేశ చాలుక్య ... ... కకాఱపరమణ్డల చూఱకారపతిదేవ (గురుద్విజభక్తులైన) కుఱుమఱ జమ్ముణ్డైన మహామణ్డలిక భీమ ... ... ... లకు మెచ్చి బెజవాడ రద్దికంబు దయసేసిన

చ. (ఉరుశకవత్స)రంబులు రసోదధివాయుపథేందుసంఖ్యగా
... ... ... ... ... న్బెజవాడరద్దికం
బరిపురభేది రాజపరమాత్మునిచేం బడసె వ్రవీందులును
ధరణియు నంబురాసులు సదాగతిమార్గ్గఁము గల్గునం త్తకును. 3

---

1. శేష -అని చదువవలయును.
2. యశోర్థాఁ ”
3. రాజయి ”
4. లట్టులతి ”
5. రశ్మి- అని చదువవలయును.
6. వెలుంగ- అని యున్న నన్వయము సుకరముగా నుండును.

## 9. కొణిదెన

శ. స. ౧౦౫౦.

(ఈపద్యము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందలి శంకరేశ్వ రాలయములో నొకఱాతిస్తంభముమీఁద నున్నది. ఆ ఱాతిమీఁదనే గుండిమడ అన్న మంత్రి చేసినధర్మములను గుఱించిన పెద్దశాసనము కలదు. ఈపద్యమాయన్న మంత్రికే సంబంధించినదయినట్లు కనఁబడుచున్నది. అన్న మంత్రితండ్రి గుండ మంత్రి త్రిభువనమల్ల దేవునికొడుకు నన్నిచోడుని మంత్రి యయిన ట్లున్నది. ఈనన్ని చోడుఁడే శ. స. ౧౦౦౨ లో కొణిదెన గ్రామమందలి త్రిభువన మల్లికార్జున మహాదేవరకు కొణిదెనకుఁ దూర్పున నున్న దేఁగఱమూఁడి యిచ్చినట్లు దేఁగఱమూఁ డిలో నొక శాసనమున్నది. మఱియు నీపద్యమే శంకరేశ్వరస్వామి యాలయములో వేఱొక ఱాతిమీఁదఁ గూడ నున్నది. ఆఱాతి మీఁద నీపద్యము క్రింద "కమ్మనాటి స్థలము అడ్డసుంకఱులు" శ. స. ౧౦౬౭ లో శంకరేశ్వరస్వామికి ధర్మము చేసినట్లొక శాసన మున్నది. ఈరెంటిలిపియు నొకరీతిగానే యున్నది. దీనినంతను బట్టి చూడ నీపద్యము శ .స. ౧౦౫౦ ప్రాంతమున చెక్కబడిన ట్లూహింపవచ్చును. Government Epigraphist's Collections No. 175 of 1899.)

చ. గడుసరిలోభి యర్థ మది గన్న పుంగానికి బంధ్దికానికిం
బుడమికి నన్య కాంతలకు భూపతికిం జను మంత్రియన్న ని[1]
పడిసినయర్థ మిష్టకు[2] బన్ధుజ నాలికి దీనకోటికిని
గుడ్ల[3] కవారిసత్రములకుం జను సుద్ధ[4] చరిత్రం బాత్రమై.[5]

---

1. నీ యనియుండనోపు, మంత్రి యన్న అనునది సంబోధన మగును.

2. మిష్టులకు- అని చదువవలయును.

3. గుడులకు ,,

4. శుద్ధ ,,

5. శుద్ధచరిత్ర పాత్రమైయనియున్నఁ గవి హృదయానుసారముగానుండునని తోఁచుచున్నది.

## 10. నాదెళ్ళ

**శ. స. ౧౦౫౨.**

(ఈశాసనము గుంటూరు మండలములో నాదెళ్లగ్రామమందు మూలస్థానేశ్వరాలయములో నొకఱాతి స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. IV. No. 677.)

శ్రీమన్మహామండలేశ్వరబుద్ధనరేంద్రునకు॥

ఉ. శ్రీరమణీలలాముండు వశీకృతవీరవిరోధి హారనీ
హార సరోజరాజహరహాసయశోనిధి వంది బ్రిందమం
దారుం డపారవిభ్రమజితస్మరమూర్త్తిఁ సతుర్త్తఁ[1]వంశని
స్తారకుం డెఱ్ఱమండందు బుధ ప్రణతుం డుదియించ్చె[2] వానికిని. 1

క. సూరిక విస్తుతు ణ్డనఘుండు
చారుచతుర్త్థఁ న్వయాబ్ధిచంద్రుణ్డు గులని
స్తారకుణ్డు సుజననిధి రిపు
వారణగజరిపుణ్డు బుద్ధవమ్మఁ జనించెను.

మ. అమ్రితాంశుండు. వయఃపయోధి నుదయం బయ్నట్లు[3] మంద్దార ప్రి
క్షము హేమాద్రి జనించినట్లు రవిరాగంబొందం బూవ్వాఁచలేం
ద్రమునం దుద్భవమయిన[4] యట్లతని కుద్య త్తేజు ణ్డయి[5] మన్మమ
మహీపాలుణ్డు పుట్టె వైరిపురలుంటాకుణ్డు శౌర్య్యోఁన్నతిని. 3

---

1. చతుర్థ–అని చదువ వలయును.
2. 24 డుదయించ్చె అని చదువ వలయును.
3. బైనట్లు అని చదువవలయును. ...
4. మైనయట్ల– ”
5 తేజుణ్డై– ”

క. ఆస్థానగగనతరణి మ
నస్థగితమ్రిగాంకమాలి[6] నాదిండ్ల[7] మూ
లస్థానమ్మృదున కాసమ
రస్థలహాలి మన్మమండెరా జతిభక్తిని. 4

ఉ. అంబక సాయ కాంబర మ్రిగాంక్కమితం బగుచుండంగా శకా
బ్దంబులు మేఘమాససితపంచ్చమి నిర్జ్ఝరనాథమంత్రివా
రంబున దేవ దేవునకు రాగముతోడ నఖండదీపర
త్నం బొనరించ్చె నారవిసుధాకరతారకమ్మై వెలుంగ్గంగాను. 5

---

6. మౌళి- అని చదువవలయును
7. నాదిండల - అని కవిపాఠమని తోఁచుచున్నది.

## 11. నిడుబ్రోలు

శ. స. ౧౦౫౪.

(ఈశాసనము గుంటూరుమండలములో నిడుబ్రోలు గ్రామమందు శ్రీచోళేశ్వర స్వామిగుడి యెదుట నున్న రాతిమీఁద చెక్కఁబడి యున్నది. South Indian Ins- - criptions Vol. VI. No. 123.)

సీ. లాటవిలాసినీలాలాటతిలకునిం
గేరలికరలగ్న కేలిపద్మం
గర్నాటసుందరీకర్నా వతంసునిం
గుంత్తలీక్తునలకుసుమదాము
గౌడసతీనేత్రకాలాంజనుని నంగ
భామాకపోలాప్త పత్రరచను
నేపాల కామినీనీరంధ్ర కుచహారు
నంధ్రీ తనూకుంకుమాంగరాగు
రమణతో నాదిదానుల రాసి కెక్కి
దీనజనముల యడఱెల్లం దీర్చ్చుచు(న్న)
యనఘచారిత్రు మారబండనిన తగిలి
పొగడ విందుము నెల్ల భూభుజులసభల.

శా. పెంచ్చెం జుట్టల నెల్ల(0) బేమ్మి వెలయ న్బెట్టించె సత్రంబు గ
ట్టించ్చె న్భక్తి శివాలయంబు లిలం బ్రౌఢింద్దాల్చి యొప్పంగ్గ(ం) గ్రొ
ప్పించ్చెం బూన్న తటాకములు జలధిగంభీరంబ్లుగాంచే న్నిధులు*
నించ్చె న్మారయపండ(ం)కర్థి భవనానీకంబుల(ం)గ్గీర్త్యు్ణ్ణై 9

స్వస్తి॥ శ్రీమత్రిభువన చక్రవర్తి శ్రీవిక్రమచోడదేవరవిజయ రాజ్య సంవత్సరంబుల పదియేడగు నేండు శకవర్షంబులు ౧౦౫౪ గు నేంట్టి వైశాఖశుద్ధ తృతీయ్యయు గురువారము నాణ్డు- (ఇత్యాది)

---

* గంభీరంబుగాఁ బెన్నిధుల్ అని యుండవలయును.

## 12. యనమలకుదురు

శ. స. ౧౦౫౪.

(ఈ శాసనము కృష్ణామండలములో గన్నవరము తాలూకా ఎనమలకుదురు గ్రామమందు శ్రీకేశవస్వామిగుడియెదుట నొకరాతిస్తంభముమీఁద చెక్కబడియున్నది. ఈగుడిలోనే వేఱొక శాసనములోనీభీమరాజే ౧౦౫౪ సంవత్సరమున- శాకే యుగ బాణ ఖేందుగణితే- మఱియొక ధర్మము చేసినట్లున్నది. South Indian Inscrip tions Vol. VI, No. 100.)

శా. శ్రీకాంత్తాప్రియు' లిష్టసిష్ట[1]జనతాశీవ్వ్రర్ద్ధనులు ధా(ర్మ్మిక) కు
ల్నా కీశోన్నతభోగ భాగులు జనానందప్రదు ల్విద్విషా
నీకారణ్యమరుత్సఖులు బహుకలానిష్ణాతు లుద్యత్సిత
శ్లోకులు గీతణ్డుం దమ్ముబంగియు జగల్లుంఠాక[2] భంగ ప్రదులూ.

ఉ. అందు గిరీ(శు)కంటె సుభటాగ్రని[3] అర్క్కజుకంటె దాని శ్రీ
నంద్దనుకంట్టె రూపి సుర నాతుని[4]కంటె విలాసు ణ్డాపగా
నంద్దనుకంట్టె శౌచి నలినప్రియుకంట్టెం బ్రతాపి దణ్డభ్రి
న్నంద్దనుకంటె సూన్రితుణ్డనం దగు బంగ్గి ధరాతలంబునను.

క. ఆతమ్ముబంగ్గికిని రా
మాతిలకం బైనబాదమకు నయవినయా
న్వీతుణ్డు బొద్దణ్డు బుధసం
ప్రీతికరుణ్డైన తమ్ముభీమణ్డు ననంగ్గాను.

---

1. *శిష్ట - అని చదువవలయును.*
2. *లుంటాక ”*
3. *సుభటాగ్రణి ”*
4. *నాధుని అని చదువవలయును.*

చ. అతులితపుణ్యమూర్త్తు లభియాతి నృపాలక భంగదులు జగ
ద్ధితహిత సచ్చరిత్రు లుదియించ్చిరి[5] అంద్దునుం దమ్ము భీమణ్ణా
జ్జితుణ్ణై[6] సప్తసంతతులుం జేకొని నిల్పి ధరామరోత్తమ
ప్రతతికి నగ్రహారము ల(పా)రము లిచ్చె దయానుభా(వ)నను.

శా. ఆదిం జెప్పంగంబద్ధధర్మ్మ్యవులు ధర్మ్మారంభుణ్ణై చేసి వి
ద్యాదానంబు హిరణ్యదానమును భూ దానంబు గోదానక
న్యాదానంబులు నాంగ్గం బూని మహిలోనను పుట్టపుంబట్టను
త్పాదించ్చె న్మతి తమ్ముభీమ ణ్ణొగి సత్రంబులు ప్రపలు వెక్కులును.

5. లుదయించ్చిరి అని చదువవలయును.

6. జ్జితుణ్డయి ”

## 13. కొణిదెన

శ. స. ౧౦౫౯.

(ఈ శాసనము గుంటూరు మండలముందు కొణిదెనలో శ్రీశంకతేశ్వర స్వామి ఆలయమందున్న యొకఱాతి స్తంభము మీఁద నున్నది. Government Ephigraphist's Collections No. 166 of 1899)

స్వస్తి॥

చ. త్రిభువనగీతకీర్తిఁ నరదేవశిఖామణి గామ ధారుణీ
ప్రభుతనయుండు మండలిక భగ్గుండు[1] భర్గఁపదాబ్జషట్పదుం
డభినవరాముం డయ్యఁమకులాగ్రణి గుండియపూండి భక్తితోం
ద్రిభువనమల్లదేవండు ప్రతీతిగ శంభున కిచ్చెం బేమ్మిఁతోను.

స్వస్తి చరణసరోరుహ ... ... ... ... ... ... ...... శ్రీమన్మహా మండలేశ్వర త్రిభువన మల్లదేవ చోడమహారాజులు శకవర్షఁంబులు ౧౦౫౯ యగు నేంటి విషువు సంక్రాంతిని...

---

1 భగ్గుఁండు- అని చదువవలయును.

## 14. నాదెళ్ల

శ.స. ౧౦౬౧

(ఈశాసనము గుంటూరిమండలములో నాదెళ్ల గ్రామమందు మూలస్థానేశ్వరాలయములో నొకఱాతి స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. South Indian InScriptions Vol. IV. No. 666.)

శా. శ్రీలోలుండు వడాలు కాటనికి రాజీవాక్షి సూరాంబనాం
గా లీలం జ్జనియించెం[1] దత్సతికి విఖ్యాత ప్రభాభాసి గో
త్రాలంక్కారుండు దారిబుద్ధనకునుం ద్దత్పుత్రి, నాదిండ్లను(ఁ)
మూలస్థానము శూలికి(న్సు)కృతమును మోదప్రసాదార్థిఁ యై.

చ. అమర శతాబ్దములు హిమక రాంగ్గవియత్ససి[2] సంఖ్యగాను బౌ
(ష్య)మున సితేతరార్కఁతిథి శౌరిదినంబున[3] భక్తి యేప్పఁడం
గమలదళాక్షి వెన్నమ ప్రకాశముగాంగ నఖండదీపర
త్నము రచియించె నారవిసుధాకర తారక మై వెలుంగంగాను.

స్వస్తి॥ శ్రీశకవర్షఁంబులు ౧౦౬౧ యగు నేంటి పౌష్యబహుల సప్తమి వడ్డవారమున వెన్నమ శ్రీ నాది(ం)డ్లమూలస్థానమహా దేవరకు నఖండవర్తిఁ దీపమునకుం బెట్టిన గొఱియలు ౫౫॥

1. జనియించెం- అని చదువవలయును,
2. వియచ్ఛశి- ”
3. సౌరిదినంబున అని చదువవలయును.

## 15. నాదెళ్ళ

శ. స. ౧౦౬౧

(ఈశాసనము గుంటూరు మండలములో నాదెళ్ల గ్రామమందు మూలస్థానేశ్వ రాలయములో నొకఱాతి స్తంభముమీఁద చెక్కఁబడి యున్నది. South Indian Inscriptions Vol. IV. No 672.)

ఉ. హారతుషారశంఖవిమలాభ్రమహోజ్జ్వలకీర్తిఁ జాలం బొ
ల్పారిన బుద్ధమండలికు నగ్రసుతుం డగు మన్మమండం డా
చారపరుండు నాదెండ్లం[1] జారుతరం బగువెండికొండ నాం
గోరి శశాంక్క మౌలికి విగువ్వఁనతో[2] గుడి నిల్పె భక్తునను[3]

చ. గడియమదేవినంద్దనుం డగన్య[4] గుణాకరధర్మ్మశీలుం డి
ప్పుడమి వెలుంగు నొంచెడ్లపూండి[5] మహేశున కిందుమౌలికిం
గడు ననురాగ[6] చిత్తమునం గల్గి నిజం బగుచుండ నిచ్చె నీ
జడనిధులుం దివాకరుండు జంగ్రుండునుం గలయంత గాలమును.

ఉ. మేరుగుణావతారుం డగుమేడనికిం గలుహారగన్ధి అం
భోరుహ[7] నేత్రి అన్వయ[8] విభూషణి నాందగు మేడమాంబకుసుం
గారవలీలం బుట్టి గుణగౌరవసంప్పద విస్తరిల్లిగా
న్ధారికి సీతకు న్శచికిం దా నధికం బని బ్రస్తుతింపం[9]గాను.

చ. వరశకవత్సరంబు లుదువల్లభతర్కన భేందుసంఖ్యగాం
బరగి వెలుంగు మాఘసితపంచ్చమియుం గవివాసరమునం[10]
దురుతగకీర్తిలోలుం డన నొప్పిన బుద్దంద్రి పాలు[11] కాంత్త దా
నరు దగుచుండ నాదెండ్ల అందు ప్రసిద్ధిగ[12] శూల పాణికిని.

క. వ్యా లేభచర్మ్మ ధారికి
మూలస్థానంబునాదిమూర్తికి శ్రీకా
పాలికి మృడునకు హరునకు
నీల గ్రీవునకు నీశునికి నుమపతీకిని.

క. స్త్రీరమతి[13] గడియమదేవులు
దిరమ్మైయుండంగ నఖండదీపము నిల్పెం
దరతర మొన్నతముగ నీ[14]
ఖరకరజలజారితారకముగ ధరిత్రిని.

యీదీపంబున కిచ్చిన గొఱియలు ౫౫। వీనిం జేకొని మన్య గొ(మ్మ)య కొడ్కు ప్రోలబోయుండు ఆచంద్రార్కా్కమ్ముం బుత్రానుపౌత్రికము నిత్యమానెండు నెయి దివియకుం బోయంగలవాండు.

చ. చిరముగ దేవదేవునకు శ్రీబలిదేవరదేవి శంఖులా[15]
భరణము గీతవాద్యములు (బ)ట్టున చీరలు ధూపఘంటయుం
దిరమగుఘంట వరియలము[16]దీపనికాయము ధేనుసంఘము
న్న రు(దు)గమనుమ[17]మండండు ప్రియంబొనరనురచియించ్చెభక్తితోను.

చ. అతిసయ[18] మైన ఛత్రమును నద్దము నుల్లము నాలవట్టమును
జితమగుం జామరావలియుం జిండచయంబులుం గేతనంబులు
న్న తులమహోశ్రీవాహనున క(ద్రి)జ(నా)తున కింద్దుమైవులికా[19]
యతమణి మన్మమండండు(జ)యాస్పదుం దొప్పంగ నిచ్చెభక్తితోను.

నొంచినిపాడు గోరుకొన్న కొల్చు దేవరకు వీస వి(డువం)గలవారు.

---

1. నాదెడలం- అని చదువవలయును.
2. మిగువ్వఁనతో ఆనునది సాధువుగాఁ గాన్పింపదు; విగువ్వఁ శబ్దమైనచో నకారమునకుఁ బ్రసక్తిలేదు. విగువ్వఁశబ్ద మైనచో విగువ్వఁణముతో ననియుండ వలయును.
3. భక్తినిన్ - అని చదువవలయును.
4. గణ్య- అని చదువవలయును.
5. నొంచెవలపూండి- అని చదువ వలయును.

6. అనురాగ= అనురాగము. ఈ శబ్దము ను జరిత్రాది గణములోఁ జేర్చినచో మువర్ణ లోపము సిద్ధించును.

7. యంభోరుహ-అని చదువవలయును.

8. యన్వయ ”

9. ప్రస్తుతింప- అని యుండవలయును.

10. వాసరంబునం- అని యుండ వలయును.

11. బుద్ధనృపాలు ”

12. నాదిడలయందుం బ్రసిద్ధిగ ”

13. స్థిరమతి- ”

14. మున్నతముగా - అని యుండ వలయును.

15. సంకులా ”

16. వర్యలము ”

17. మన్మ ”

18. అతిశయ - అనియుండవలయును.

19. నాథున కిందుమౌళి కా ”

## 16. నాదెళ్ళ

శ. స. ౧౦౬౨

(ఈశాసనము గుంటూరుమండలములో నాదెళ్ల గ్రామమందు మూలస్థానేశ్వ రాలయములో నొక ఱాతి స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. మొదట ౫ సంస్కృత పద్యములును బిదపఁ దెనుఁగుపద్యములు నున్నవి. సంస్కృతభాగములో "కరరసవియ దిందుమితే శకసమనిచయే" యని యున్నది South Indian Inscriptions Vol. IV. No. 675.)

శా. శ్రీ వేంగీవసుధాంగనాతిలక మైశిష్టక్షమా దేవ(బృం
దావాసం బగువానరంబుపతి యుద్యత్కీర్తిఁ యజ్ఞత్రయ
వ్యావర్ధిష్ణుమహిష్ఠతప్రకటపున్యారంభుండై[1] యొప్పె స
ద్భావిం2 బోతనసోమయాజి నిచితబ్రహ్మాండతేజుం డిలన్.

చ. అతనికి నాత్మజుండు సుజనాగ్రణి దొడ్డపనాయకుండు ద
త్సుతుం దనవద్యకీర్తిఁ మతిసూయ్యుఁడు వానితనూజుం డుజ్వల
వ్రతుం డగుమంత్రి శ్రీధరుండు వానికి సూరవసానికిని బృహ
స్పతినిభుం డుద్భవించె బుధబంధునిధానుండు గంటం డిమ్మహిని.

ఉ. శ్రీలలనాపరిగ్రహుండు శ్రీధరునగ్రతనూభవుండు వి
ద్యాలలనుండు గంటం డుదయస్థితి నొప్పుటంజేసి పౌషఁం[3]
బేలికి యిచ్చెం[4] బేమ్మిఁ నుతికెక్కె వదాన్యత ప్రస్ఫురించే భూ
పాలక నీతినిస్తరణ (వ)ట్టముగట్ట ధరాతలంబునను.
అట్టి కంట నామాత్యుకులస్వామి-

క. ధర సిద్ధి బేతచీ(ఖ్ఖ)లి
హరిణమృగేంద్రుండు బడిగొలాజుఁనుం డాజిని
శ్రీవచ్చ [6]లక్ష్మ గోయింద[7]
గిరివరవజ్రము జగజ్జిగీషుండు వేమ్మిఁని.

ఉ. శ్రీలలనుండు దాయగజసింఘము సో(డి)యగొంకధారి(ణీ)
పాలక శేఖరుం డతనిభక్తికి శక్తికి మెచ్చి యందలం

# 52. కరీంనగర్

శ. స. ౧౧౦౦ ప్రాంతము.

(ఈ శాసనము గోలకొండ దేశములో వెలిగందల యనుప్రాచీననామముగల కరీంనగరము పట్టణమునందు అవ్వల్ తాలూకాదారు (కలెక్టరు) కచ్చేరీలో నున్న యొకఱాతి మీఁద చెక్కఁబడియున్నది. అక్షరముల యాకారమును బట్టి ౧౨వ శతాబ్దము లోనివని తోఁచుచున్నది.)

స్రగ్ధర.

శ్రీ కాన్తాకాన్తుచే (నా) శ్రితవిబుధజనాశీస్థిర ప్రాజ్యరాజ్య
శ్రీ కాన్తాకాన్తుచే విస్త్రితనిజభుజనిస్త్రింశనీతాన్యరాజ
శ్రీకాన్తాకాన్తుచే దిక్షితిగగన సమాశ్లిష్ట విస్పష్ట కీర్త్తి
శ్రీ కాన్తాకాన్తుచే నూర్జ్జితరిపుమ్రిగరాజీమ్రిగా రాతి చేతన్

చ. ప్రి॥ పరనరపాలమౌలిమణి భాసురదీప్తిల తావితాన వి
స్ఫురితపదాబ్జుచే నహితభూతలనాధవరూధినీసరో
వరమధన ప్ర(భూ)తమదవద్విరదాధిపుచే విరోధిభూ
ధరశిఖర ప్రభిన్నవిడిత త్రిదశేంద్రనిశాతహేతిచేన్.

క. సురక రిపరిమ్రిగపతి ...తి
సుర(స)తి(క)మల సరసిరుహ-

(అసంపూర్ణము)

## 53. ద్రాక్షారామం

శ. స. ౧౧౦

(ఈశాసనము ద్రాక్షారామమునందు భీమేశ్వరాలయమందున్నది. శాసన కాలము గల మొదటిభాగము ఖిలమైపోయినది. "శ్రీమన్మహామణ్డలిక దోరప నాయకుల ప్రధాని, సోమనపెగ్గడ కొడ్కు దత్తెనపెగడ" శ.స. ౧౦౭౦ మున శ్రీభీమేశ్వరదేవర కఖండ వర్తిదీపము నిలిపినట్లు ౧౧౭౯ సంఖ్యగల శాసనము వలనఁ దెలియుచున్నది గానఁ బ్రస్తుతశాసనకర్త యగు సోమనప్రెగ్గడ యాదత్తా మాత్యుని కొడుకని తలంచినచో నీ శాసన కాలము ౧౧౧౦(౧౦౭౫+౩౫)అని యూహింపవచ్చును. South Indian Inscriptions Vol. IV. No. 1180.)

శా. భారద్వాజపవిత్రగోత్రుణ్డు జగత్ప్రఖ్యాతిగాం బెట్టెం భూ
(హారా) భుం డ్డొరగాండివల్లభుండు దత్తామాత్యసోముణ్డు దా
క్షారామ ప్రముఖోల్లసత్ప్రకటపంచారామతీర్థంబులను
సారాఖణ్డ శాష్తదీపకము లాచంద్రాక్కతారంబుగాన్.

ఉ. దానదధీచి సోముం దవదాతయశః ప్రసారుణ్డు[1] పుత్రసం
తాన(స)మృద్ధుండై చెఱ్వు[2] ధర్మ్మవివాహము దేవగేహ(ము)
... వనము[3] సత్ప్రబంధము నిధాన మనంజనుచున్న సప్తసం
తానములుం బ్రసిద్ధముగ ధారుణిపై నిలిపెం గ్రమంబునన్.

---

1. ప్రసరుణ్డు- అని చదువునది...
2. చెఱువు "
3. ముద్యానము "

## 54. అమరావతి

శ.స. ౧౧౨౨

(ఈ శాసనము గుంటూరుమండలమునం దమరావతి గ్రామములో అమరేశ్వరుని ఆలయమునకు వెలుపల తూర్పుదిక్కునఁ బాఁతియున్న యొక ఱాతిపలక మీఁదనున్నది. South Indian Inscriptions Vol. VI. No. 215.)

మొదటివైపు

ఉ. శ్రీపరమేష్ఠిపాదసరసీరుహయుగ్మమునందు సంభవం
బై పరగెం జ్జతుర్థకుల మందులంబుట్టిరి భూరికీర్త్తు లు
(ద్దీపిత)ధర్మ్మచిత్తు లినతేజు లనేకులు సద్గు(ణ)...ం
దీపుడమిం బ్రసిద్ధముగ నెఱ్ఱమనాయకుం డున్నతస్థితిన్.

చ. ఘనుండు దుదియించ్చె[1] నాతనికిం గంజ్జదళేక్షణ రేకమాంబకుం
దనయులు పుట్టి రిద్దగుణధాములు సోమన వెన్ననలు యశో
ధనులన నందు సోమయకుం దమ్ము ... ... . పనాయకుండ్డు స
జ్జన(రవి)జమ్మం డాతనికిం జం ... ... ... కసానిన్.

(దీనిపిదప నీ వైపునఁ గొన్ని పంక్తులున్నవి. అవి సీసపద్యభాగములుగాఁ దోఁచుచున్నవి. పాదవిభాగము చేయుటకుఁ గూడ ననుకూలముగలేవు గావున విడువంబడినవి. ఎఱ్ఱమనాయకుం డొకానొక పూండిలో తటాకము త్రవ్వించి నట్లున్నది.

రెండవ వైపు

క. శరనయనశశిధరిత్రీ,
పరిగణనం బొంది శకనృపాలాబ్దంబు
ల్పరగంగ నక్షతదియయు
ధరణీసుతదినమునందు దాల్పయ్యామతోను.

స్వస్తి శ్రీ మతు గొట్టిపత్తి ఎల్లమనాయకుండు శకవర్షములు ౧౧౨౨ గు నేంటి వైశాఖశుక్ల త్రితియ్య భౌమవారము నాండు దనతల్లి (తరువాతి భాగము ఖిలమైనది.)

---

1. దుదయించె- అని చదువవలయును.

## 55. అమరావతి

శ. స. ౧౧౨౨

(ఈశాసనము గుంటూరుమండలమందు అమరావతీ గ్రామమందు అమరే శ్వరస్వామియాలయము వెలుపల తూర్పు దిక్కున పాఁతియున్న యొకఱాతిపలక మీద నున్నది. South Indian Inscriptions Vol. VI. No. 215.)

శా. శ్రీరమ్యంబగు వెరిజాసన ... ... షట్కర్మ్మార్ధ
మ్మార్ధరంభుం డిల నప్పనా... ద్యన్మూర్త్తిగా వానికిం
దారాకల్పవధూ ... ... గువిద్దాసానికిం బుత్రకుం
డారంగా ... ... ట్టెబుధు లత్యంత్తంబు వర్న్నింపంగాన్.

చ. గుణ(నిధి స)జ్జన ప్రభుండు గొంటెన పెద్దికి సత్పతి వ్రతా
(మణియ)గు మాంకమాంబికకు మానుషపౌరుష గౌరవ ద్వి(జా
గ్రణి) నిజభక్తితోషితవిరాజిత చంద్రధరుండు సత్య(భా
ష)ణుండుదయించ్చె నూర్జితలసన్మతి యప్పన పెద్ది యిద్ధ(రన్)

శా. ప్రస్తుత్యంబుగ నిట్లు దానుదయమఇ[1] భాస్వద్దశా..ండై
స్వస్తిశ్రీవిభుం గేతభూవిభు నిజస్వామిని సదాసు ......
తస్తోత్ర శవణియ్యం[2] జేయుచును మిత్రశ్రేణి రక్షించుచో
న(స్తోకు)ండై యప్పదేవండు సముద్యత్కీర్త్తి వర్వ్వె న్మహిని.

క. విద్వత్సభం (జె)ప్పందగును
సద్విజు రాయూరిపూర్వ్వశాసను శ్రీభా
రద్వా(జ)గోత్రు శివుచర
ణద్వయపూజితుని నప్పనం బ్రథిత(య)శున్

చ. అమల శకాబ్దములు గరసహస్రకరక్షితిసంఖ(గా)గం బౌ
ష్యము సితపక్షశైవతిథి నారు దినంబున నుత్తరాయనం
బమరిన సంక్రమాణమున నప్పన వెట్టె నఖండ దీప ము
త్తముం డమరేశుమ్రోల శశితారక మొప్పి వెలుంగుచుండంగాన్

---

1. మై- అని చదువవలయును.

2. శ్రవణీయం- ”

## 56. వేల్పూరు

శ. స. ౧౧౩౧

(ఈ శాసనము గుంటూరుమండలమందు సత్తెనపల్లి తాలూకాలో వేల్పూరి గ్రామమందు శ్రీరామలింగేశ్వరస్వామియాలయము వెలుపలిమండపములో నొక స్తంభముమీఁద చెక్కబడియున్నది... Government Epigraphist's list No 554 of 1925)

చ. శక సమములు మహీగుణవృషధ్వజసంఖ్యగం జైత్ర కృష్ణప
తకతిథిం జం ద్రజాహనజసంక్రమణంబున వేల్పునూరితే
నికి వరరామనామునకు నెమ్మిం బ్రదీపము గేతవల్లభో
త్సుకమతిం బెట్టె దాం గసది సూరమదేవు లఖండ్డ మున్నతిని.

శ్రీమన్మహామండలేశ్వర కోటకేతరాజులు భోగస్త్రీ కసది సూరమ దేవులు శకవర్షంబులు ౧౧౩౧ ణ్డగు నేంట్టి చైత్ర బ౨ బుధవారమున విషువు సంక్రాంతియందు దమతల్లి యమరసానికి ధర్మార్థముగా వేల్పు-

(అసంపూర్తి)

## 57. మో(మా)గల్లు

శ. స. ౧౧౪౦ ప్రాంతము.

(ఇది కృష్ణామండలము నందిగామతాలూకాలోని మోగల్లు గ్రామమందు వేణుగోపాలస్వామిగుడియెదుట నున్నఱాతిమీఁద శాసనభాగము. శాసన సంవత్సర మున్న భాగము ఖిలమైపోయినది. కాని గద్యభాగములో నీదానము కాకతీయగణపతి దేవుని పుణ్యమునిమిత్తము చేయఁబడినట్లున్నది. కావున, శాసనము. శ. స ౧౧౪౦ ప్రాంతమనాఁటి దనవచ్చును. Government Epigraphist Collection Nos. 265-67 of 1924.)

శా. శ్రీమంతుం డగుబచ్చు నామయం బ్రభాశ్రీరమ్యు శ్రీరాముందే
జోమిత్రుం డగునన్నవోతి దయంగాచుం గాత నిత్యంబు సు
త్రామారాధితపాదపంకజ సముద్యత్సుందరుం డైనశ్రీ
భౌమాధీశుం డభీష్ట సత్ఫలము బొప్పం బ్రీతితో నిచ్చుచున్.

దీనితరువాత సీసపద్య మున్నది గాని, ఖలమైనది. దానియంత మందలి యెత్తుగీతి–

ప్రస్తుతంబుగా విలిచి గోపాల దేవు
నకు హితముగ నాచంద్ర తారకముగాంగ
దేవభోగంబుగా నిచ్చె ధీరనుతుండు
బచ్చుసూయ్యుఁాండు సుజనైక బాంధవుండు

## 58. కొణిదెన

శ. స. ౧౧౪౬

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు శంకరేశ్వర స్వామి యాలయములో నొకఊతికంబముమీఁద చెక్కబడియున్నది. South Indian Inscriptions Vol. VI. No 628).

శా. శ్రీమత్కౌస్తుభరత్నభూషణరుచిశ్రీరమ్యవక్షస్థలుం
డామందారలతాంత్తదామనవదివ్యామోదపాదాబ్జజా
తామేయామరసింధువారిక్రితపూతాసేష[1]లోకుండు నాం
గా ముల్లోకవిభుండు స్కకిగలం దైక్యవ్యాప్తి దా నాద్యుండై.

ఉ. ఆతరిదాల్పు నాభిదలితాబ్జమునం దుదియించ్చె బ్రహ్మసం
ప్రీతిగ-నావిరించ్చిఁ మరీచి జనించ్చె మరీచి కన్వయ
ఖ్యాతుండువుట్టెం గస్యపుండు[2]గస్యపుం[2]దనుమునికుద్భవించేలో
కాతతరమ్యమూర్త్తిగమలాప్తుండుసూర్య్యుండువంశకర్త్తయై.

మ. ఘనుఁడాసూర్య్యునకన్వ(యాది)జుండనంగ్గరాజధర్మ్మంబతా(o)
దనువై శాశ్వతరాజయోగముననొంద్దం బుట్టె వైవశ్వతుం[3]
డనఘుం డాతని కుద్భవించ్చె మను వుద్యద్వేద శాస్త్రార్త్థత
త్వనిజాచార సమస్తధర్మ్మనయశాస్త్రప్రౌఢ కాచార్య్యుండై.

గద్దె. ఇట్టి మనువంశంబున నిక్ష్వాకు పుట్టె నిక్ష్వాకువంశంబునం గకుస్థుండు పుట్టె నాతనికిం బ్రిధివి దనపేరు జేసినం బ్రిధుండడు[4]పుట్టెం బ్రిదువంశంబున మాంధాతృండుపుట్టె మా ధాంతవంశంబునంబురు కుత్సుండు పుట్టెం బురుకుత్సు వశంబున సాగరంబు దనపేరంజేసిన సగరుండు పుట్టె సగరవంశంబున దిలీపుండు పుట్టె దిలీపవంశంబున భాగీరధి దనపేరుగాం దెచ్చిన భగీరధుండు పుట్టె భగీరధ వంశంబున నతీతానాగతవంశకర్త్తయైనరఘువు పుట్టె రఘువంశంబున నారాయణావ తారుండైన శ్రీరాముడు పుట్టె శ్రీరామ వంశంబున నలుచక్రవర్తి పుట్టె నలునికిం బుండరీకుండు పుట్టె పుండరీకవంశానుక్రమంబున నాది రాజులకంట్టెం బ్రసిద్ధుండై కరికాలచోడచక్రవత్తి పుట్టి భానువంశంబు గరికాలవంశంబునాం బేరుకొని చతుస్సాగరపరియంత్త మహీచక్రంబు నిర్వ్వక్రంబుగా వాలివాతం బాలిచ్చి..

క. కరికాల చోడ నరపతి
వరగంగ నిజలాంచ్ఛనములు బలువిడి హిమవ
ద్గిరితటముల సేతుమహీ
ధరతటముల నిలిపెం జక్రధరతుల్యుం డై.

క. కావేరిదగులు గట్టంగ
వేవేపల్లవుండు దనదు వెట్టికి రామినిం[7]
దావాని నుదిటికను వోం
గావడిం గరికాలవిభుండు గాలం దుడిచెను.

క. ఇనుపాదము లర్చింపంగం
జనుచో(ం)జని అర్ఘ్యమంత్రజలపాత్రలు దా
వినువీది నాంగం బంచ్చెను
ఘనముగం దనయాన వొడిచి కరికాలుం డిలను

క. అట్టికరికాలనృపతికిం
బుట్టెను మహిమానచోడు భువినతనికిం దాం
బుట్టిరి గరికాలుండు సిరి
కట్ట ననుంగులుం దొండమా(నఘ)నదశవమ్మ౯లు

---

1. శేష- అని యుండవలయును.
2. గశ్యపుండు- ”
3. వైవస్వతుం- ”
4. జేసినప్రిథుండు- అని యుండవలయును.
5. నలచక్రవత్తి౯
6. పయ౯ంత్త అని యుండవలయును.
7. రామిన్-

క. ఆకరికాలనరేంద్ర
ప్రాకటవంశమునం బుట్టె భాస్కరకులర
త్నాకరచంద్రుండు రిపున్రిప
భీకరుండధికుండు చోడబిజ్జన బిరుదై.

క. రూడిగ బిజ్జనదనురెం
డాడినభూపతుల శిరము లసీముఖమునం జెం
డాడుచుం గయ్యము లిరువది
ఏడెన్నంగం బొడిచె జయమహీవల్లభుం డై.

క. బల్లహుతో ఘనవిజ్జన
వ్రల్లాటమునవచ్చు పాముం బట్టినం గని యా
బల్లహుం డిచ్చె గ[illegible]ాంక్గము
గొల్లభిగొని జనులు గండ్డగోపాలుం డనను.

క. దండ్డి (జగ)దొబ్బగండ్డండు
గండ్డరగండ్డండు వీరఖణి బిజ్జన యు

8. వ్రల్లటమున- అని యుండవలయును.

ద్దండుండు దాం బదుమువ్వర
గండ్డం దనుధార నిలిపెం గటకములోనను.

చ. వ్రి॥ బిరుదనం జన్నయా తెలుంగుబిజ్జనమనుమండు[9] మల్లిదేవం ద
చ్చెరు వగుచున్నపొత్తపియ చెన్నగువీడుగ వాలి పాకనాం
డిరువదియొక్కవేయిం జననేలుచు బల్లహుదండ్లు గెల్చి త
త్కరివరకుంభమౌక్తికలతాతతిం బూచే నిజాసిపుత్రికను

చ. అతనికిం బుట్టి రొప్ప మధురాంత్తకపొత్తపిచోడసిద్ధి భూ
పతియును మల్లి దేవండును బాహుపరాక్రమవిక్రమక్రములు
నరనరనాథభాల[10]కషణస్థిరపాదసరోజవైభవులు
వితతసముద్రకాంచ్చి పరివేష్టితభూపరిరక్షణక్షములు.

---

9. మన్మండు అని యుండవలయును. 10. ఫాల అని యుండవలయును.

క. క॥ ధరం బొత్రపి[11] సిద్ధినరే
శ్వరునికి నుదియించ్చి భూమి సన నేలిరి స
చ్చరితులు పొతప్తిసోమీ
శ్వర[12] దేవండు మల్లిదేవవసుధాధిపుండును.

ఉ. వి॥ భూపదిలీపుండై పరగుపొత్తపిసిద్ధని తమ్ముమల్ల ధా
త్రీపతికిని సమస్తజగతీపతికిని సుతు లుద్భవించ్చి రా
శాపరిపూన్ర్ణ[13]కీత్తులు భుజాబలవత్తులు నైన తొంట్టియ
య్యోపిలిసిద్ధియుం గులసముద్ధరణుం డగుమల్లిదేవండును.

క. క॥ ఆపొత్తపిసోమీశ్వర[14]
భూపతికిం దమ్ము మల్ల భూపాలున క
య్యోపిలిసిద్ధికిం దమ్ముండు
దీపితసితకీత్తి౯ మల్లిదేవండు వరగెను.

చ. ౖవి॥ పరగిన మల్లిదేవజన పాలుండు పొత్తపిచోడవంశశే
ఖరుం డినవంశకత్త౯ యనంగాం గడు వాలి విరోధిరాజసం
హరణుండు దొంటితాతల క్రియం దగుపొత్తపిరాజధానిగా
ధర సకలంబునేలె విదితంబగు బాహుపరాక్రమంబునను.

క. ఆమల్లిదేవనికిం గుల
భామాతిలకంబు పుణ్యభాగిని గౌరీ
శ్రీమహదేవికిం బుట్టెం ద
పోమహిమ ఫలమ్ము దాన పొడ వైనగతిని.

---

11. బొత్తపి-
12. సోమేశ్వర అని యుండవలయును.
13. పూణ్ర్ణ
14. సోమేశ్వర-

క. ఇనుం దుదయ మైన యట్ల
మను వుదయం బైనయట్లు మఱి రఘురాములు
జనియించ్చినట్లు గులవ
ధను డోపిలిసిద్ధివిభుండు దానుదియించ్చెను.

మ. ప్రి కరికాలోత్తమ రాజవంశమునం దా గౌరీమహా దేవికిని
సురధులు గల్పకుజాతములు రసన దీతో(యంబు)[15] సింత్తామణులు
ధరనేకాక్రితిం బుట్టెనో యన జగ దాంక్గుండై[16] యిచ్చు దీ
నుర కియ్యోపిలిసిద్ధివల్లభుండు గన్నుౕ కొందన్ను వన్నిౕ పంగా[17] ను

ఉ. ఓపిలిసిద్ధివల్లభు జయోన్నతుం దేంకణచక్రవత్తిౕ నా
జ్ఞాపరిరక్షితాఖిలదిశావలయును ఘనదానకన్నుౕ లీ
లాపరిపూన్నౕ[18]రమ్యశుభలక్షణమూత్తిౕ జయంత్తు నశ్వసి
క్షా[19] పురుహూతుం బేరుకొనంగాం జనుంజోదకులైకభూషణును.
సకలాధీశనతోత్తమాంగ్గమణిభూషారమ్యపాదాంబుజుం[20]దా
టక నారాయణు భానువంశ (నిపచూడారత్ను సిష్టేష్టబం[21]
ద్ధుకవీంద్రద్విజరక్షుం గాస్యప[22] సుగోత్రుం బాటక[23]వ్వాతపు
త్రకు మా యోపిలిసిద్ధిం జెప్పందగు నుద్యద్గండ్డగోపాలునిని.

---

15. సురనదీస్తోమంబు– అనియుండనోపు
16. జగద్దానాంక్కుండై – ”
17. గణ్నుౕందన్ను వణ్నిౕంపంగా ”
18. కణ్నుౕ లీలాపరిపూణౕ–అనియుండవలయును.
19. శిక్షా–
20. పాదాబ్జు–అని యుండ వలయును.
21. శిష్టేష్ట–
22. గాశ్యప–
23. బారక– ”

చ. త(న)నిజవ్రిత్తి మింద[24] విదితంబుగ నోపిలిసిద్ధి విన్న సి
ద్ధనకు నన్గుందమ్ముండు[25] వ్రతాపమునం జని కమ్మనాండు సే
కొని గణపతీశు[26] దయం గూడి తదాజ్ఞ వహించ్చి యేలెం బా
వనమగు నాఱువేలును నవక్రపరాక్రమవిక్రమంబునను.

వ: ఇట్లేలి సప్తసంతానంబులు దేవబ్రాహ్మణదత్తులు సమస్తధమ్మ్ముంబులుం బ్రతిపాలించ్చి॥ స్వస్తి చరణసరోరుహవిహిత విలోచన త్రిలోచన ప్రముఖాఖిల ప్రిథ్వీశ్వర కారితకావేరీతీర కరికాలకుల రత్నప్రదీపాహితకుమారగజాంకుశ యొఱయూరి పురవరాధీశ్వర సూయ్య్ర వంశోద్భవ కాస్యపగోత్ర[27] తేంక్గణాదిత్య జగదొబ్బగండ్ఢ కీత్తిౖనారాయణ సమస్తప్రశస్తి సహితంబు శ్రీమన్మహామండలేశ్వర యోపిలి సిద్ధనదేవచోడమహారాజులు స్వస్తి శ్రీశక వర్షంబులు ౧౧౪౬ గు తారణ సంవత్సర కాత్తిౖక శుద్ధశ్రీయేకాదసిశుక్రవారమునం గమ్మనాంటిలోన నిజరాజధాని యైన కొట్టియదొన శ్రీశంకరేశ్వరశ్రీమహాదేవరకు గణపతి దేవమహా రాజునకు ధమ్మ్ర(వు)గా హవిబ౯లి యచ్చ౯నలకు[28] నంగభోగరంగభోగాలకు నందుల మొగడచెఱువు దేవభోగ మాచంద్రాక్క౯తారకము సవ్వ౯కారపరిహారము[29] గా నిచ్చితిమి.

మంగళ మహ శ్రీశ్రీ.

---

24. మింద= మీద
25. ననుంగుందమ్ముండు- అనియుండ వలయును.
26. గణపావనీశు- అని యుండనోపు.
27. కాశ్యపగోత్ర- అని చదువునది.
28. హవిబ౯ల్యచ్చ౯నఖకు.
29. సవ్వ౯కరపరిహారము అని చదువవలయును.

## 59. ఉప్పరపల్లె

శ. స. ౧౧౫౭

(ఇది హైదరాబాదురాష్ట్రమునందు కరీంనగరముమండలములో ఉప్పరపల్లె గ్రామమున నొక దేవాలయములో ఱాతిస్తంభముమీఁద చెక్కబడిన శాసనభాగము. Hyderabad Archaeological Series No. 3. అనుపత్రిక నుండి గ్రహింపఁబడినది.)

ఉ: శ్రీమదనూనదానజలసేవకుం బాయక మ్రోయుషట్పద
స్తోమనినాదము న్వినుచు సూరెల నెప్పుడుం బ్రస్తుతించు సి
ద్ధామరకోటికి న్వరదుండైన గణేశుండు సుస్థిరస్థితిం
గామసమానమూర్త్తి యగుకాటయ కీవుత మిష్టసంపదల్.

క. చరణసరోరుహరాగ
స్ఫురణన్మహిషనిశిరంబు వొలుపుగ సంధ్యా
భ్రరుచి నెనయ మెట్టిన స
త్కరుణాన్విత దుగ్గ్ర వరము గాటయ కొస(ం)గున్.

క. ఉరగేంద్రదిగ్గజములకుం
బరమోత్సాహముగ నాతపత్రమువోలె
న్ధర యెత్తిన కిరివరుం డగు
హరి గాటయ కీవుతము దయామతి శుభముల్.

క. దేవాదిదేవుం డమిత
స్థావరజంగమమయుండు సర్వేశుండు గౌ
రీ(వ)రుం డనవరతంబును
నీవుతం గాటయకు దయ నభీష్టఫలంబుల్

క. హరిదశ్వుం డజాచ్యుతశం
కరమూర్తి త్రయీమయుండు గమలాప్తుండు భా

స్కరుండు ద(యం గాచుచుండెడుం)

గరుణారసపూర్ణ్ణ హృదయుం గాటయం బ్రీతింని.

స్వస్తి శ్రీమదపారపారావారపరివృతమహీతలంబున సకలజన వినుతం బగునంధ్రదేశంబునకు (వి)భూషణం బైన యనుమకొండ యనుపురవరంబు నిజ రాజధానిగా నొప్పుచుంన్న కాకతెభూపాలక్రమంబున జనవినుతయశోవిలాసుండును జయలక్ష్మీనివా సుండును నైనరుద్రనరేంద్రసుపుత్రుండును[1] సదారాధితత్రినేత్రుండును విబుధజనవనవసంతుండును రమణీయ్య[2] సీమంతినీజయంతుండును సకలజన మనో రంజనుండును నరాతిరాజమదభంజనుండును శరణాగతరాజశరణ్యుండును వినతాఖిల రాజవరేణ్యుండును ధైర్య్యామరసానుమంతుండును దు(రం)గమ రేవంతుండును సత్యహరిశ్చంద్రుండును విభవామరేంద్రుండును నైన గణపతిదేవ మహీనాథునకుం బ్రధానియై-

క. కనకాచలధీరుండు జన
వినుత చరిత్రుండు గార్య్యవిదుం డినతేజుం
డనఘుండు గుణనిధి బెజ్జమ
తనయుండు బుధదీనభానుతనయుం డనగాంన్

మ. ప్రతిపక్ష క్షితిపాలకుంజరమదప్రారంభ సంరంభ ము
ద్ధత బాహానిహిత ప్రచండనిశితోత్ఖడ్గధారానఖా
హతి భేదించి యఖర్వ్వగర్వ్వబలశౌర్య స్ఫూర్త్తిం గంఠీరవా
కృతియై (సన్నుత) వృత్తి దాల్చి వెలసెను రే(చెర్ల)రుద్రుండిలన్.

---

1. గణపతిదేవుఁడు రుద్రనరేంద్రుని తమ్ముఁడైన మహాదేవుని కొడుకైనట్లు పెక్కు శాసన ములందున్నది.

2. రమణీయ- అని యుండవలయును.

సకలజనవినుతయశుండును గుణగణాలంకారుండును నైన కా(డ్రెడ్డికి(ం) సౌభాగ్య సౌందర్య చాతుర్య్యంబులు గలిగి[3] పరగిన పరమపతివ్రతయైన బెజ్జమాంబకుం బ్రియనందనుండును ననవరత ధర్మ్మసమేతుండును పతిహితాచరణుండునుం గాకతెరాజ్యభారధౌరేయుండును సద్గుణ ప్రఖ్యాతుండును నతులబల పరాక్రమసమన్వితుండును నైన రేచెర్లరుద్రునకుం బ్రధాని.

క. కులతిలకుండు వసుధామర
జలధిసుధాకరుం డశేషజననుతచరితుం
డలఘుండు రిపుతరుదావా
నలుం డనంగాం బరగె రాజెనాయకుం డుర్వ్విని.

బోక్కెరలోని వీరభటావలి వధించి గోధుమఱతి తలదెంచి ఉదగిరి[4]సాధించి పడిరాయనిం దోలి దాక్షారామభీమేశ్వర దేవర కక్షయదీపంబు లునిపి ధర్మ్మసమేతుం డైనరాజెనాయకునికి ధర్మ్మ (పత్ని యు)సుచారిత్రతయు వనితాలలామయు నైన రవ్వ(మాంబకు) సుపుత్రుండు.

క. సరనిధి[5]గంభీరుండు సు
స్థిర తేజుండు వంశ శేఖరుండు దయా
కరుండు బుధాంబుజదశశత
కరుం డని వర్న్నింప[6]నొప్పుం గాటయధాత్రిని

(దీనిపిదప నొక పెద్దవచనము గలదు. అందు కాటయ ౧౧౫౭ వ శక సంవత్సర మునకు సరియైన "మన్మథ సంవత్సరమాఘశుద్ధ ౧౫ గురు వారము నాందు పంచలింగాలకును పెంచరపల్లిని" దానము చేసి నట్లున్నది.)

---

3. చాతుర్య్యంబులం గలిగి- అని చదువునది.
4. ఉద్దగిరి- అని యుండనోపు.
5. శరనిధి- అని చదువునది.
6. వర్ణ్ణింప-

## 60. కాజ

శ. స. ౧౧౫౯

(ఈ శాసనము గుంటూరుమండలమునందు కాజగ్రామములో అగస్త్యేశ్వర స్వామి యాలయము తూర్పు గోడమీఁద చెక్కఁబడియున్నది.)

స్వస్తి సమధిగతపంచమహాశబ్ద మహాసామంత మహాసామంతాధిపతి మహా ప్రచండదండనాయక పదవిరాజమానులైన శ్రీమహా(దం)డనాయక మల్లినాయకుండు తమతల్లి కొమరమదేవులకు ధర్మ్మువుంగాం గ్రాంజ ఐతీశ్వరమహాదేవరకు అఖండదీపానకుం బెట్టిన మేంకలు ౨౫।

(దీని తరువాతఁ గొన్ని యక్షరములు భూమిలోఁ గప్పువడి పోయినవి.)

సీ. నుతనిధిశరరుద్రమిశకసమపుష్య
సితవనుతిధి సూర్య్యసుతదినమున
మకరసంక్రమవేల సకలధరాధినా
ధుండగుచోడని దండనాథుం
డనఘుండు మల్లన దనమాతగొమరమాం
బికకు ధర్మ్మువుగాంగం బ్రీతితోడ
కనకాద్రి ధైర్య్యుం (డ)ఖండవర్త్తికి సప్త[1]
వింశతిగొరుల[2] వెలయనిచ్చి
అచల(పుత్రి)పతికి నైతీశ్వరాంకున
కమరగణనమద్పదాంబు(జు)నకు
వరదునకుం ద్రిలోకవంద్యున కెత్తించె
దీప మఖిలలోక దీపకముగ.

---

1. పంచ- అని యుండనోపు.

2. గోట్టెల- అని యుండనోపు.

## 61. వేదాద్రి

శ. స. ౧౧౭౩.

(ఇది కృష్ణా మండలములో వేదాద్రి గ్రామమందు లక్ష్మీనరసింహస్వామిగుడిలో నొకఱాతిమీఁది శాసనము. Government Epigraphists Collection No. 307 of 1924.)

సీ. శ్రీశక (భూపా)భిషేక వత్సరములు
గుణముని(భూ)చంద్రగణన మాఘ
విశదపక్షంబున దశమియు సోమవా
సరమున గణపతిక్ష్మాత లే(ంద్ర)
(ర)మనియ్య[1]కార్య్యభారకుండు (వాయ ...ం) కంటి
కాక ... ... ...నుత్పలదళాక్షి
సూరమాంబకుం గీర్త్తిసాదయుం దన్న
యకుం బుణ్యముగ జగత్ప్రకటితముగ .
శ్రీవిభాతి సూరేశ్వరదేవదేవు
శివు భవానీశు సుప్రతిష్ఠితునిం జేసె
దేవతులితుండు ధారుణీదేవకులుండు
దామనామాత్యుం డాచంద్రతారకముగ.

క. శ్రీరమణమంత్రి దామయ
కోరిక దగ- లెంక వంటి శోభిమతవి[2]
స్తారుప... దయుండై శ్రీ
సూరేశ్వరదేవుపేర శోభితుండయ్యెన్.

చ. వెలయ నుమేశ్వరాయతనవిస్తర మొప్పంగం జేసి యందు నం
దులం దనరించి చిత్రవితతులు ప్రతిభ నచియింపంబంచి పే
శలముగ మంటపంబు విలసన్నతి[3] ప్రిత్తముగా నొనచ్చ్రటం
బొలుపుగంబ్రస్తుతింపం దగుం లోచయదామనిం గీర్త్తి ధామునిన్.

సీ. ఈహితసిద్ధిగా నేగె సూ రేశ్వర
దేవ(దే)వుని సుప్రతిష్ఠ సేసె
ఆదేవునకు భోగ మచ్చోట నిరువట్టీ
యుత్తమక్షేత్రంబుం గ్రొత్తచెఱువు
వెనుకదక్షిణభాగమున రెండు మఱుతులుం
దగుప్రవిత్తి యాచంద్రతారకముగం
గొమరైన లోహితగోత్రుండు దామనా
య్యాత్మజుం దగుపోచనాయ్యపుత్రుం
డంచితముగ దామనామాత్యుం డిచ్చె శ్రీ
గణపతిక్షితీశ కార్య్యభరణ
భవ్యమూర్తి లెంకవంటి కోకునకు న
న్నయ్యకుం బుణ్యముగ జనస్తుతముగ.

---

1. రమణీయ- అని యుండవలయును.
2. కోకవినుతవి-అని యుండవలయునేమో.
3. విలసన్మతి- అని యుండవలయును.

## 62. చందలూరు

శ. స. ౧౧౭౫

(ఈ శాసనము నెల్లూరుమండలములో ఒంగోలు తాలూకాలోని చందలూరు గ్రామమందు రామలింగేశ్వరస్వామి యాలయము నెదుటనున్న ఱాతిమీఁద చెక్కఁ బడియున్నది. Nellore Inscriptions Vol. 2. No. 238.)

శా: శ్రీశాఖాబ్దము[1] లింద్రియాద్రిశశిధాత్రీసంఖ్యగా విస్ఫుర
ద్వైశాఖంబున సప్తమిని దివసక్రీడ్వారంబునన్[2]షడ్విజి[3]
గీశుం బ్రీతిం బ్రతిష్ట సేసె వరభోగేంద్రుండు సేవైకవి
ద్యావరుడు[4] చతుత్త్వన్[5] వంశుండు బుధధారుండు మారుండిలన్

స్వస్తి సమస్తప్రశస్తిసహితరి శ్రీమన్మహాప్రధాని సర్వాఽధికారి మాయిదేవపెగ్గడ తంనేలిన అద్దంకి సింగ్గళదేవనికి తనకూ అభివ్రిద్ధిగా చెందలూరి చెంనామల్లినాధ దేవర (అసంపూర్తి.)

---

1. శాకాబ్దము- అని యుండవలయును.
2. దివసరాడ్వారంబునన్ - అని యుండనోపు.
3. ఇచ్చట గణము తప్పినది- సరియైనపాఠము చింత్యము.
4. విద్యాశూరుండు- అని యుండనోపు.
5. చతుర్థ- అని యుండవలయును.

## 63. బెజవాడ

శ. స. ౧౧౭౭.

(ఈశాసనము కృష్ణామండలములో బెజవాడలో ఇంద్రకీలపర్వతము నడుగున ఖిలమయిన మంటపములో నొకఱాతి స్తంభముమీఁద చెక్కబడియున్నది. South Indian Inscriptions-Vol. IV. No. 716. ఆఱాతిమీఁదనే యీ శాసనము పైని శ.స.౧౧౭౭ లో గొంటూరినారాయణదేవరాజుల ప్రధాని కూచెనపెగ్గడ అఖండదీపము వెట్టించినట్లున్నది. ఈ శాసనము కూడ నా కాలమునందే పుట్టినట్లూహింపవచ్చును.)

ఉ. (పాత్రు)ల సత్కవీంద్రుల విపశ్చిదనీకముం బ్రోచి నీ(తిచే)
ధాత్రికి నెంత్తయేనియు ముదం బొనరించిన యీపరాంగనా
పుత్రుండు దమ్మనారి బలింబోలి మహీతల మేలుం గావుతను
ధాత్రియు నబ్జమిత్రుండు సుధాకరుండుం గ్గలయంన్తకాలమును.

## 64. పెదకాకాని

శ. స. ౧౧౮౪

(ఈశాసనము గుంటూరుమండలములోని పెద్దకాకాని గ్రామములో వేణుగోపాలస్వామి యాలయము నెదుట నున్న యొక శిలాస్తంభముమీఁద చెక్కబడి యున్నది. South Indian Inscriptions Vol. IV. No. 700.)

శ్రీశకరాజాభిషేక సంవత్సరంబులు ౧౧౮౪ దుందుభిసంవత్సర మాఘశుద్ధ దశమియు గురువారమునాండు కోటకాకాంటిని కీర్త్తిశ్రీగోపినాధనిని మాణికము ప్రతిష్ఠసేసి తిరుముట్ట మెత్తించి అంగరంగభోగములు దేవునికి సమర్పించె.

క. కందం। శ్రీకీర్త్తి గోపినాధునిం
గా కాంటపురేశుం గొలిచి కౌస్తుభరత్న
శ్రీకనురూపము నాంగా
లోకములో మాణికము వెలుంగ్గుచు నొప్పెను.

క. వినుతింప మానికమునకుం
దనయుండు గీర్త్తియన బుట్టి ధమ్మ్రపరుండ్డై
వనజోదరు శ్రీకార్య్యము
నొనరంగం జేయించుచుండ్డె నుత్తమచరితను.

(దీనితరువాతి భాగము చాల ఖిలమైనది.)

## 65. నంబూరు

శ. స. ౧౦౯౭

(ఈశాసనము గుంటూరుమండలములో నంబూరుగ్రామమందు మల్లేశ్వరాలయములో నొకజఋతి స్తంభముమీఁద చెక్కబడియున్నది. South Indian Inscriptions Vol. IV. No. 703.)

క. (ధర)రిసి(ని) ధిరుద్రసమితిం
(బర)గంగ భాద్రపదక్రిష్ణపంచమి గు(రువా)
సరము(న) సంగయకాముండు
చిర తరముగ మండపంబు (సే)యించె ధరన్.

## 66. గణపేశ్వరం

శ. స. ౧౨౩౫

(ఈ శాసనము కృష్ణామండలములో గణపేశ్వర గ్రామమందు దుర్గాంబగుడిలో నొకఱాతిస్తంభముమీద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. IV. No 952)

సీ. స్వస్తి సమస్తరాజన్యచూడామణి
కిరణరంజిత పాద సరసిజా(తుం)
డగుకాక తియ్యధరాధీశుశ్రీవాకి
లికి నంగరక్షయై ప్రకటశౌర్య్యా
ధనుం డనం బరగి యమ్మనుజేంద్రుం డొసగిన
వెలనాంటినాయకస్థలము వ్రిత్తిం
బెనుపొందం బడసిన పెదనీలినాయని
యగ్ర నందనులు భయార్త్తిహరులు
పురుహూతనిభుం దగు బోలైయ[1]నాయుండు
నాయకాగ్రణి గాళినాయకుండు
ననంగం (బ)రగి రవని నతుల ప్రతాపసం
పన్ను లధికబాహుబలులుఘనులు.[2]

ఉ. వారియనుంగ్గుందమ్ముండు సువన్ర్ణ గిరీంద్రసమానధైర్య్యుం డం
భోరుహమిత్రతేజుండు ప్రభుత్వసమగ్రుండు వల్లినాయకుం
డారంగ నగ్రజాన్మతి[4]ననంతసమంచితధర్మ్మకార్య్యములు
ధీరుండు సేయుచుండ్డుం దగ దేవగురుద్విజపూజ లొప్పంగాను.

---

1. బొల్లెయ- అని చదువవలయును.
2. ఈపద్యములో సీపాదము లైదును గీతపాదములు రెండును గలవు.
3. సువణ్ర్ణ- అని చదువవలయును.
4. అగ్రజానుమతి- అనునది సాధురూపము కాని యట్లు దిద్దిన ఛందోభంగమగును.

చ. వరగుణరత్న రాసి యగువలైయ[5]కును శివపాదపద్మష
ట్చరణపతివ్రతాగుణవిశాలయశోనిధి యన్నె మాంబకును
వరసుతుండైనపోచయ యవార్య్యభుజబలశౌర్య్యశాలి సుం
దరజితమన్మథుండ్డు రుచిధామసుతేజుం డుదారమూర్త్తియై.

సీ. తమతల్లిదండ్రులకు[6] ధర్మ్మువు రాజ్యాభి
వృద్ధియుంగాం దనబుద్ధిం గోరి
శరగుణరవిమిత శకసమాసితపుష్య
సురపతితిధియును గురుదినమును
వెలనాంటిలోపల వినుతింపంగా బేరు
గలిగి క్రిష్ణాబ్ధిసంగమమునందు
పొలుపైన పెదదీవిపురమున గణపతీ
శ్వరదేవునకు గొని కరము నేభ
యింటి[7]నొసగి పెయ్య లేంభది[8] వెరసినూ
రును నఖండదీపమునకు భక్తి
దనరంగా రవీందుతారకముగ నిచ్చి
పుల్లరియును విడిచె భూసుతుండు.
కామరాజుగడ్డను సుక్షేత్రము యేందుము॥ శ్రీ ॥

---

5. రాశి యగువల్లెయ- అని చదువునది.
6. తల్లిదండ్రులకును ధర్మ్మువు- అని చదువవలయును.
7. నేంబదింటి- ”
8. లేంబడి- ”

## 67. నకరికల్లు

శ. స. ౧౨౫౪.

(ఈశాసనము గుంటూరుమండలములో నకరికల్లుగ్రామమునందు నరసింహ స్వామియాలయములో నొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది.)

క. శ్రీనారీసహితుండై
శ్రీనరసింహుండు తనదు సేవాపరులను
శ్రీనగరకంటి నెప్పుడు
శ్రీనిలయులం జేసి కరుణం జేకొనికాచును.

శ్లో. సదా నగరకంటీశో నృసింహో భక్తవత్సల[1]
తరంగితకృపాదృష్ట్యాః[2] పాయాద్వోస్సార్వకాలికం.

క. స్వస్తి శ్రీశకవర్షాస
విస్తరణం బెట్టిదనినం వేయిటిమీంద[4]
నిస్తారం మిన్నూఱును[5]
ప్రస్తుతి నేంబదియు నాల్గు వరలడిచోటను.

సీ. శ్రీముఖవై శాఖ శితపక్షపంచమి
నాదివారమున మధ్యాంహ్నామందు
నగరకంటను శాంత నరసింహ్వాదేవర
సంనిదా .. మననంతలముననను[6]
జగములు ప్రోవం బాంచిళిపురంబుశ్రీ

1. వత్సలః- అని చదువునది. 2. దృష్ట్యా-అని చదువునది.

3. పాయాద్వస్సార్వకాలికమ్- అని చదువునది.

4. మీందన్- అని చదువవలయును.

5. నిస్తారమ్మిన్నూఱును-

6. అక్షరములు కొన్ని లోపించుటచేత సరియైనపాఠము నిర్ణయించుట కనువుగాక యున్నది.

గోపళయ్యమనసు కోర్కిదీర్ప

అరుగ భూవరు ణిచ్చే[7] నని చెల్లనిచెను8

బుద్ధాంకుం టెంబది[9]పుట్లుపొలము

అదియు నూరుగా సమర్పించెం జనుకాలి

సింగవిభుండు నారసింహ్వనకును

నారసింహ్వాపురము నలినొప్పుచు నన

వేమ మహింద్రు[10] పుణ్యవిహర మయ్యె..

---

7. భూవరుండిచ్చె-అని యుండనోపు.

8. నిచ్చెను- అని చదువవలయును.

9. దేంబది- ”

10. నలినొప్పుచును ననవేమ మహిపు- అని యుండనోపు.

## 68. అమీనాబాదు

శ. స. ౧౨౫౦

(ఈ శాసనము గుంటూరుమండలములో అమీనుబాదా గ్రామమందు మూలం గూరమ్మగుడి యున్న కొండమీద చెక్కబడియున్నది)

సీ. శాకాబ్దములు సహస్రమును నిన్నూంటతొం
బదియెనిమిది యగు భవ్యసంఖ్యం
గలిగి యొప్పారెడు నలవత్సరంబున
మాఘమాసము పూర్ణమాదినమున
విశ్వోత్తరుం డనవేమభూపాలుండ్డు
దమకులస్వామిని కమృతకిరణ
రేఖావతంసకు శ్రీమూలంగూరమ్మ
కఖిలజగన్మాత కంగరంగ
భోగసంసిద్ధికిని ధారవోసి ఇచ్చె
గ్రామములు మూండు శ్రీకోటభూమియంద్దు
పడిదరము మూలంగూరం బ్బన[1]పలకలూరు
దానఖచరేంద్రుం డాచంద్రతారకముగా.

సీ. క్రమపరిప్రాప్తసామ్రాజ్యసింహాసనా
ధ్యాసియై యఖిలరాజాధిరాజ
పరమేశ్వరుం డ్డాజిపార్థుండ్డు పెదకోమ
టన్న వేమాధీశుం డ్డర్థి సురభుం
డైన[2] కూర్మ్మిపినతండ్రి యనవేమభూపతి
సేసినధర్మ్మమూర్జితముగాంగ
నీగ్రామములు మూంటి కెల్లకాలంబుభో
గైశ్వర్యసర్వమాన్యతలనొసంగె

నంబికకు మూలంగూరమ కళిలజనని.
కధి×ం గట్టించ్చె భువనమోహనముగాంగ
సమధికోన్న తానభం3కషంబు లైన
గుడియుం బ్రాకారవలయంబు గోపురములు.

---

1. గూరంబ్బు-అని చదువవలయును.
2. సురభుండ్డొ- ”
3. సమధికోన్నతి నభ్రం- ”

## 69. తాళ్ళపొద్దుటూరు

శ. స. ౧౩౦౦

(ఇది కడపమండలమునందలి తాళ్ళప్రొద్దుటూరుగ్రామమందు ఆంజనేయ స్వామి యాలయమునకుఁ దూర్పుగా నున్న ఱాతిమీఁది శాసనము. శాసనకాలము చెప్పఁబడలేదు. లిపినిబట్టి శ.స. ౧౩౦౦ ప్రాంతముదని చెప్పవచ్చును)

.. ఇల జగతాపిఖడ్గమున నీల్గినవీరు(ణి)1 రంభవుచ్చుకోం
దలంచినం దూప్పు×దిక్కునఘ్రితాచి గిసుక్కునం దుమ్మె నంతలో
పలం జనుదెంచ్చె వా(ని)కులభామిని (ని)ంగి పథంబునందు ని
ష్ఫలతకు రంభయు న్వెలఱువాఱిన నవి(రి) దోడికామినులు.

.. గురుమరణోచితం బయినకోపమునం జమదజ్ఞిజుండు2ము
న్నిరువదియొక్కమాంటు ధరణీశునెల్లను జంపి యమ్మహా
పురుషుండు మర్త్యలోకమునంబుట్టి వధింపంగం బాపమంచు వి
స్తరముగం దాలె3 గాక జగతాపి దలంచిన నాండ చంపడే

సీ. తురగచమ(×)ంబునం గరమొప్ప నెఱికింగాం
బసరించి దానన ముసుంగువెట్టి
తెలుపెక్కం గఱివోవ బుళగినవునుక మిం
చిన వెండికోరంగాం జేతంబట్టి
ఏనుక4తలలలో నెసగిన ముత్తియుం
బులు గుంకుమాక్షతంబులుగం బోసి
వేతాళఢాకినీభూతంబులార మీ
కును ముంజికం బని కుడువంజెప్పి
యొక పిశాచవధూటి దో నుత్సహించే
రాయజగతాపగంగ భూరమణుం డాజి
సమరం బెండ్లి5కొడకు మల్లావనీశుం
బెలంగి సురశాంతతోం బెండ్లిసేయునపుడు.

ఉ. పన్ని తురంగమంబునకుం బక్కెర వెట్టినవార్త (హే?) రిచే
విన్నభయంబునం గలంగె వీసరనాండునుం జక్రగొ(ట్ట)మును
మన్నియ (వడ్లెక్కెలియ) మ(ల... ద్యన) వేంగి గళింగ లాదిగా[6]
నిన్నియు నొక్కనాండ .........(నే)ఱువ భీమన్రిపాలుథాడికిని.[7]
(ఈచివర పద్యమునకుఁ బైపద్యముతో సంబంధమున్నట్లు తోఁపదు.)

---

1. వీరుని-అని చదువునది.
2. గురుమరణోదితం బయిన కోపమునం జమదగ్నిజుండు-అని చదువునది.
3. దాళెం-అని చదువవలెను
4. ఏనిక-అని చదువవలెను.
5. బెండిలి... అని చదువవలయును.
6. ఈపాదమునకు సరియైనపాఠము నిర్ణయింపవీలు లేకున్నది.
7. ధాటికిని- అని కాని, దాడికిని అని కానీ యుండవలయును.

## 70. ద్రాక్షారామం

శ. ప. ౧౩౦౩

(ఈశాసనము గోదావరీమండలములో దాక్షారామమున భీమేశ్వరాలయము లో ఉన్నది. South Indian Inscriptions Vol. IV. No. 1379.)

శకవరుషంబులు ౧౩౦౩ గు నేటి వైశాఖ శు ౧౦ గు।

సీ. నంద్దిదీపావలి నాట్యకల్యాణహో
మశనివారగయాకర్ణమంటపములు
దిరుచుట్టుమాలియ దివ్యలింగ్గంబుల
గుళ్లు వఙ్రంపురాకోట గోపు
రములు వాతాళగేహములు సోపానభాం
డ్డాగారవివిధ ధాన్యాలయములు
వంటయింద్లు[1] సతు ద్వార్ణరకవాటములు
వ్రేమ దాక్షారామభీమనాధు
నగర నాచంద్ర తారకోంన్నతులు దిశల
వెలయు జేయించ్చె నన వేమువేచురాను(?)
విజయ[2] చంణ్డ ధాముని[3]జగనొబ్బగండ్డం దహిత
ఖండనోద్దండ్డదోర్ద్ణండ్డమండ్డనుండు.
ప్రకాశ భారతీ యోగి కావ్యం। పెద్దనాచార్య్యర్ణలిఖతంశ్రీ।

---

1. యిందులు- అని చదువవలయును.
2. విజయ- అను పదమధికముగా నున్నది.
3. చండ్డధాముండ్డు- అని యుండనోపు

## 71. ద్రాక్షారామం

శ. స. ౧౩౦౩

(ఈ శాసనము దాక్షారామములో భీమేశ్వరాలయమున నున్నది. శాసన కాలము చెప్పఁబడలేదు కాని, కావ్యకర్త యొక్కఁడే కావున ౭౦ వ శాసనము నిదియు నేకకాలముననందే పుట్టియుండునని యూహింపఁదగి యున్నది. South Indian Inscriptions Vol. IV. No. 1380.)

సీ. అమరాద్రి భీమేశ్వరావాస మబ్దిస
ప్తకము శ్రీసప్తగోదావరంబు
వలయాచలేంద్రంబు వజ్రపుఱాకోట
గులపర్వతంబులు గోపురములు
దిరుచుట్టుమాలియ యరవిందజాండ మ
మర్త్యలోకము నాట్యమంటపంబు
పరివార దేవతాభవనంబు లీచతు
ర్దశభువనంబులు (దా)రకములు

గనక కుంభతతులు గాంగ దాక్షారామ
మన్నవో(ంతు) వేమనానుజుండ్డు
గడు నపూర్వ్వశ్రిష్టి[1] గావించి వాసన
కెక్కె శ్రీవేమ సితయశుంణ్డు[2]
ప్రకాశ భారతీ యోగి కావ్యం। పెద్దనాచార్య్యలిఖితం.

---

1. సృష్టి- అని చదువునది.
2. నాల్గవపాదము "శ్రీలకెక్కె వేమసీతయకుండు" అని యుండనోపు.

## 72. ఫిరంగిపురం

శ. స. ౧౩౩౧

(ఈశాసనము గుంటూరుమండలములో ఫిరంగిపురము గ్రామమందు వీరభద్రస్వామిగుడి యెదుట శిలాస్తంభము మీఁద చెక్కఁబడియున్నది. Epigraphia Indica Vol. XI.)

సీ. శాకాబ్దములు సహస్రమును మున్నూంటము
ప్పదియొక్కండును నైన భవ్యసంఖ్య
వఱలువిరోధిసంవత్సరంబున ఫాల్గు
నంబున బహుళపక్షంబువిదియ
శుక్రవారంబున శుభముహూర్తంబున
శ్రీదాన్యవాటిపురాధిపతియుం
గ్రిష్ణ వేణ్ణాజలక్రీడావినోదుండ్డు
నగుగన్నభూపాలుననుంగుంబు త్రి
వీరనారాయణుండు వేమవిభునిదేవి
భూరిసద్గుణనికురుంబ సూరమాంబ
జగము వినుతింప సంతాన సాగరాఖ్య
వరతటాక ప్రతీష్ఠోత్సవం బొనర్చెc

సీ. జహ్నువీయమునాదిసకళపావననదీ
విమలతీర్థాంభఃపవిత్రితంబు
సవిధదేశస్తాయి[1] శివమౌళిబాలేందు
కౌముదీసంఫుల్లకైరవంబు
బహుమహాపరివాహపాథోభరధ్వాన
ఘుమఘుమాయితదిశాగోళకంబు
జలసారణీసేకసంవర్ధితా నేక
వనవినీతాధ్వగాధ్వశ్రమంబు

బలవదురుమత్స్యకచ్ఛపదుళికుళీర
తిమి తిమింగిళవిక్రమక్రమవిహార
తరళతరతుంగభంగకదంబచుంబి
తాభ్రవీధి సంతానమహాపయోధి.

సీ. కపటసూకర మైన కైటభాసురవైరి
ఖురపుటంబులం బరిక్షుణ్ణ మయ్యె
రఘుకులోద్వహధనుర్యంత్రముక్తములైన
చిచ్చుఱమ్ముల వేండిం జేవదఱగెం[2]
గుంభసంభవునిహస్తాంభోరుహంబున
నాపోసనం బయి[3] హ్రాసమొందెం
బాషాణముల నచ్ఛభల్లగోలాంగూల
కపియూధములచేతం గట్టువడయె
వనధి యేభంగి సరివచ్చు ననంగవచ్చు
నారసాతలగంభీరవారి యగుచు
నపగతాపాయ మగుచు శోభాఢ్య మగుచు
ననుపమం బైనసంతానవనధితోడ.

(దీనితరువాత నీయర్థమునే తెలుపు సంస్కృతపద్యములుగలవు.
ఆపద్యముల చివర-
విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమభూపతేః
అకరో దాకరో వాచాం నిర్మళం ధర్మశాసనం.
అనియున్నది.

---

1. స్థాయి- అని చదువునది.
2. దఱిగె-
3. నాపోశనంబయి- అనిచదువునది.

## 73. అమీనాబాదు

శ. స. ౧౩౩౭

(ఈ శాసనము గుంటూరుమండలములో అమీనాబాదా గ్రామమున కీశాన్య మూలనున్న పుల్లరిబో దనుకొండ పడుమటి ప్రక్కను వరాలగాది యను బండ కుత్తరముగా చెక్కఁబడియున్నది. Government Epigraphist's collection No. 543 of 1999.)

సీ. శాకాబ్దములు సహస్రంబును మున్నూంట
  ముప్పది యేడును యొప్పు[1] మిగుల
మహనీయ మైనమన్మథవత్సరంబున
  మఖమాసమునం బూర్ణిమాదినమున
హేమాద్రి దొనచింతామణి యరిరాయ
  బసువశంకరుం డాజిఫల్గునుండ్డు
సమదారిరాయవేశ్యాభుజంగుండ్డు వే
  మయ రాచ వేమనక్ష్మావరుండ్డు
దల్లిసూరాంబచే సముత్పంన్న మగుచుం
బరగు సంతానవార్ధికి వరువగాంగ
నొలయు గిరివాహినుల జగనొబ్బగండ
కాలువ ఘటించే నా తారకంబుగాంగ.
  శ్రీ నాథకృతి.

---

1. నొప్పు అని చదువునది.

## 74. వేదాద్రి

శ. స. ౧౩౩౯

(ఇది కృష్ణామండలము నందిగామ తాలూకాలోని వేదాద్రిగ్రామమందు లక్ష్మీనరసింహస్వామి గుడిలో నొకఱాతిమీద చెక్కబడియున్నది. Government Epigraphist' s Collection No. 306 of 1924)

శుభవస్తు, స్వస్తిశ్రీశకవర్షంబులు ౧౩౩౯ అగు నేంటి హేమళంబ్బి సంవత్సర శ్రావణ శు ౫ గు స్వస్తి శ్రీమన్మహామండ్డలేశ్వర మహారాయ రాయపరమేశ్వర అవఘళి రాయమాన మర్ద్దన శింగ్గిణీ శంకార రాయపక్షి సా(ళు)వా బిరుద ప్రతాప పేరోజు(సు)లు తాను రాజ్యప్రతిష్టాప(నా) చాయ్ర్యుండైన మసదనయేలి అబి()బునిదామలు మలకవొడయు(ల)ంగారి అనుజన్మండై న శరఖుమలుక జైనదివొడయలు తూప్పుర్దేశము క్రిష్ణవేణ్యాతీరం వోడపల్లి వజీరుబాద యేలుచున్న తన నిజహితుండైన యీజదిమలుకంగారిని శ్రీకృష్ణవేణ్యాతీరము శ్రీరంగ్గరాజుకొండ్డ యేలం బుత్తెంస్తేను సకళధంమ్మ్రముల లోనుంన్ను పరమధంమ్ర మని తమవొడయులైన జైనదిమలుక వొడయులకుంన్ను నిదామలుమలుక వొడయల కుంన్ను పేరోజుసులు తాని ఖొందాలమ్మంగారికింన్నిం బుణ్యముగాను జైనదిపురము చెఱువు గట్టించ్చి అంన్నదాన వుదకదానములు వెట్టి శ్రీరంగ్గరాజుకొండ్డ శ్రీకృష్ణవేణ్యా నీళ్ళతేవు పృథివింన్ని ఆకాశమున్నుం గలకాలము అచంద్రాక్కర్ స్తాయిగాను సౌపానములు గట్టించి పృథివి రాజ్యము చేయుచుండ్డెను.

శా. శ్రీరంగ క్షితిపాలు శైలమునకుం జెంనొండ్దువాయవ్యమం
దారంగ్గాం దగు నీజిదీమలుక దానాచంద[1]తారాక్కర్మై
భూరంగం బగుం గృష్ణ వేణ్యదరళీ*పూతోదకప్రాప్తిచే
(సా)రంగ్గాఖ్య వహింప్పంజేసె నౌరా[v] సౌపానమార్గ్గంబిలనూ.
మంగళమహా శ్రీశ్రీం జేయును.

---

1. చంద్ర - అని యుండవలయును.

* తటినీ- అని యుండనోపు. [v] నవురా- అని చదువవలయును.

# **75.** వేదాద్రి

శ. స. ౧౩౩౮

(ఇది 74 వ శాసనముక్రిందనే యున్నది. Government Epigraphist's Collection No. 307 of 1924)

గీ. వొరుండు చెసిన ధమ్మంబు వుండ్డనీక[1]
చెఱిచి ధమంబు దనదని చేశినట్టి
నరుదు అఱవది[2] వేలేండ్లు నరకమంద్దుం
గూలి క్రిమికీటకాకృతిం గుంద్దుచుందూ

[4]శ్లో. శ్రీకృష్ణాతటినీతటోంన్న తరమాశ్రీరంగ్గభూపాచల
ప్రాగల్భ్యాధిప యాజిదీమల్కు (జి)కృత్వాయశో ధామకం
సోపానాంకితశాసనప్రకటితం శాతాబ్దపద్మోద్భవ
శోచిత్రేశశి హైమళంబికరదాద్యావాసరే శ్రేయశే శ్రీ శ్రీ.

సీ. తగవును ధంమ్మ౯ంబు దయయును నేప్రొద్దం
దసమనంబునం గలిగి[5]దనరు నితందు
సత్రంబుం జలివంద్రి సతతంబు వేడ్కతో
విలశిల్లంగం[6] బెట్టి వెలయు నితందు
ముదమంద వేమాద్రి[7]ముంద్రేవుక్రిష్ణకు
సొపానములు దీచ్చ్రె౯ం జతురుం డితందు
చెఱువులుం బెండ్లింద్లుం[8] జేయించ్చెం బ్రేమతోం
గలిగిన సత్కీర్తి౯ ఘనుం డితందు
అనుచుం గొనియాడుదురు నిన్ను నఖిలసభల
మలుక మహబూపు వరపుత్ర కలితఘాత్ర
దానగుణశీల నింమ్మ౯ల[10]ధమ్మ౯లోల
మహిళగుణసాంద్ర యీజెదీమలుక చంద్ర.

శుభమస్తు

1. ఒరుండుచేసినధర్మ్మంబు నుండనీక- అని చదువునది.
2. చెఱచిదర్మ్మంబు తనదని చేసినట్టి-
3. అటువది
4. సంస్కృతశ్లోకము రెండవపాదములో ఛందోభంగము కలిగినది. నాల్గవపాద మనన్వయముగా నున్నది.
5. గల్గి- అని చదువునది.
6. విలసిల్లంగం- అని చదువునది.
7. వేదాద్రి- అని యుండనోపు.
8. బెండ్లిండ్లు- అని చదువునది.
9. గాత్ర- ”
10. నిర్మ్మల- ”

## 76. పిఠాపురం

శ. స. ౧౩౫౦

(ఈశాశనము గోదావరీ మండలములో పిఠాపురమునందు కోమటిపేఁటలో గున్న జూతిమసీదు వీథియరఁగుమీఁద నున్న యొక స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. ఈమసీదులో నే వేఱొకచోట నున్న యింకొకశసనములో "స్వస్తి శ్రీశక వషంౕబులు ౧౩౫౯ అగు నేంటి సాధారణ సంవత్సర మాఘ శు ౭ శు గొంతిమాధవ పెరుమాళ్ళకును వాసిరెడ్డి పోతినేండు నగరి దక్షిణభాగాన లక్ష్మీదేవమ్మ నగరు కట్టించి ప్రతిష్ఠ చేయించెను." అని యున్నది.)

సీ. నిండ్డె నెవ్వనికీర్త్తిౕ నిఖిలలోకంబ్బుల
చంద్రి-కావిష్పార[1]సాంద్రగరిమ
వుండె[2] నెవ్వనియింట్ట పుండ్డరీకాక్షుని
ప్రాణవల్లభయైన పద్మనయన
(పం)డె నెవ్వనికృపాపాథోధి నిలయెల్ల
ధాన్యసంపూనౕ[3]వదాన్య యగుచు
మండ్డె నెవ్వనికోపమహిమానలంబుచే
అరివీర[4] గేహంబు లక్షణంబ్బ
అనుచుం గొనియాడుదురు నిన్నునఖిలసభల
వేమభూపాలకారుణ్యవిమలపాత్ర
ప్రబలకర తేజ వాసయప్రభుతనూజ
మనుజదేవేంద్ర పోతకుమారచంద్ర.

---

1. విస్పార- అని చదువునది.
2. నుండ్డె-
3. సంపూర్ణ్ణౕ - అని చదువునది.
4. నరివీర-

## 77. పంచదార్ల

శ. స. ౧౩౫౪

(ఈశాసనము విశాఖపట్టణమండలములో పంచధారలగ్రామమందు శ్రీధర్మలింగేశ్వరస్వామిగుడిలో ఆస్థానమండపమం దొకఱాతిమీఁద నున్న శాసనములోఁ జిట్టచివరభాగము. దీనికి ముందున్న గద్యములో "శ్రీశుభాభ్యుదయ శక వర్షంబులు ౧౩౫౪ అగు నేంటి పరిధావిసంవత్సర వైశాఖశు ౧౫ మొదలుగాను చంద్రవంశ్యుండైన నాగేంద్రదేవచక్రవర్తికిని, భవాని దేవంమగారికిని సుపుత్రుండైన కుమారయెఱ్ఱమయంగారు పరమేశ్వర ప్రీతిగాను ఆయాదేవస్థానాలయందుల దేవళ్ళకు సమర్పించ్చిన ధర్మాల వివరం" అని యున్నది. South Indian Inscriptions Vol. VI. No. 663.)

ఉ. శ్రీ(శ్రిత)వ(క్షు)ం డింద్దుకులసింధుసుధాకరమూర్తి సంతతో
పాశ్రితబంధురక్షణకృపావశవర్తి చతుసముద్రస
మ్మిశ్రితకీర్తి లోభినృపమిండం ... డికరి[1] సర్వలో
కాశ్రయచక్రవర్తి మహిమాధ్యుండు నాగయయెఱ్ఱండుర్విలోను.

---

1. గణము తప్పినది.

## **78.** యనమదల

శ. స. ౧౪౫౩

(ఇది గుంటూరుమండలములోని ఎనమదలగ్రామమందు వీరేశ్వరస్వామి గుడి ప్రాకారముమీఁద నున్న శాసనము.)

సీ. గుణ బాణగతిచంద్ర గణనంబు శాలివా
హనశక వర్షంబు లవనియందుం
బరగు నందనభాద్రపదశుద్ధదశమిని
సోమవారము నాండు ప్రేమతోడ
నెనమదల* వీరన్న కిరువుగాం బ్రాకార
మును భోగరాగంబు లనువు పఱచె
తననాధుం డయ్యపదండ్డ నాయకునకు
పుణ్యంబుగా నని బుధులుపొగడ
తారతారకమందార శారదా భ్ర
తుహినహిమకరవిఖ్యాతినహరహంబు
గెలుచుసత్కీర్తి ధనముగా మెలంగ నేర్చు
మల్లనరనాధుచినబొమ్మమనుజవిభుండు.

స్వస్తి శ్రీజయాభ్యుదయ శాలివాహనశకవరషంబులు ౧౪౫౩ అగు నేంటి నందన సంవత్సర భాద్రపదశుద్ధ ౧౦ సోమవారము నాండు రాయసం అయ్యపరు సయ్యవారు కొండవీటీసింహాసనము పాలించంగాను ఆయనసేవకుండు చినబొమ్మ నాయండు వీరేశ్వరుని ప్రాకారము ఖమండపములు సమర్పించెను॥ ఆయన మఱది బాణాల వీరయ్య పదకము సమర్పించెను॥

---

* ఒక మాత్ర యధికముగా నున్నది. నేనమదల్ అని చదువవలయును.

## 79. కొండవీడు

శ. స. ౧౪౬౦

(ఈపద్యము గుంటూరుమండలములో కొండవీటికోట యుత్తరపు (కొండపల్లి) ద్వారము కుడివైపుగోడమీఁద చెక్కబడియున్నది. అచ్యుతదేవరాయలు శ.స. ౧౪౬౦ ప్రాంతమున రాజయ్యెను గావున నీశాసనము శ స ౧౪౬౦ ప్రాంతమునఁ బుట్టిన దనవచ్చును.)

సీ. నిర్మించ్చె నేమంత్రి నిరుపమప్రాకార
నవకంబ్బుగా గోపినాథపురము
నిలిపినాం డేమంత్రి నియత వైభవముల
గోపికావల్లభుం కూర్మివెలయ[1]
పాలించ్చు నేమంత్రి ప్రకటధర్మఖ్యాతి
మహిమహిరంగ నంధ్రమండ్డలంబ్బు
గెలిచినాం డేమంత్రి లలితవిక్రమమునం
బ్రబలుండై యవనులబలము నెల్ల
నతండు భూపాలమంత్రీంద్రసతతవినుత
ధీవిశారదుం డచ్యుత దేవరాయ
మాన్యహితవర్తనుండు శౌర్యమహితయశుండు
భానుతేజుండ్డు రామయభాస్కరుండ్డు

---

1. గూర్మి వెలయ- అని చదువునది.

## 80. వంకాయలపాడు

శ. స. ౧౪౬౨

(ఈ పద్యములు గుంటూరుమండలమునందు వంకాయలపాడు గ్రామములో గోపిసముద్ర మను పెద్దచెఱువు గట్టుక్రింద నున్న శిలాస్తంభముమీఁది పెద్దసంస్కృత శాసనము చివరనున్నవి. ఈ శాసనములో కర్ణాటరాజగు అచ్యుత దేవరాయలమంత్రి రామభాస్కరునిసోదరియు "ప్రతాపయల్లప్రభు" ధర్మపత్నియు నగుచిన్నాంబ గోపీనాథ సముద్ర మనుపేర నొకతటాకమును ౧౪౬౯ వ శకసంవత్సరమందుఁ ద్రవ్వించెనని చెక్కబడినది.)

.... చతురజనానీతసప్తపావన నదీ
తీర్థపవిత్రి తాధిక జలంబు
సవిధ దేశవిశాలసరసరసాలాది
ఫలరసజంబ్బాలభాసురంబు
కలకంఠచంచ్చరీక శుకకలాలాప
కలితమందమనోజకౌతుకంబు
ఘటితకుల్యాగతమననీరసంచ్చార
సంవర్ధితానేక సస్యచయము
చక్రవాళాచలోపమచారుసేతు
బంద్ధబంద్ధుర నీరంధ్ర(భా)సురోర్మి
చుంబ్బితా(ంబ)ర మత్యంత్తసుకృ( )ణిస
నాధశుభ నిధి శ్రీగోపినాధజలధి.
జనతృష్ణమాన్పని జలముం బూనకయున్న
పవనజుచే దాంటంబడకయున్న
మంథానభూధరమథితంబుగాకున్న
మాంటిమాంటికి నుబ్బి మరలకున్న
గరళంబు దనలోనం గలిగి లంగకయున్న[1]

---

1. లొంగకయున్న - అని యుండవలయునా?

నొక వే(ల)లోంబడి యుండకున్న
(బ)డబాగ్ని కీలలం బరిత(పిం)ప్పకయున్న
నొడంగూడి( )న వారి నొరయకున్న
జలధి సరివచ్చు మాధుర్యచారుజలము
నపగ తా(ఖి)లదోషంబు నగుచు ధరణిం
దననదీనత్వమహిమచే ననుదినంబు
వెలయు శ్రీగోపికానాథజలధితోడ.

సీ. శ్రీమించ్చు గన్నడక్షితివరాచ్యుత రాయ
సన్మంత్రిరత్నంబు జలజనాభు
పాదాబ్జ సేవాతిభాసురహృదయుండ్డు
కొండ్డవీటిధరామండ్డలేంద్రుం
డైన రామయ భాస్కరామాత్యసోదరి
యనఘ ప్రతాపయల్లార్యపత్ని
పర్వతేశ్వర దేవుభక్తింబ్రతిష్ఠించి
గ్రామా(ది)భోగము ల్గలుగంజేసి
చిన్నమాంబిక నిజ(కృ)తస్థిరతరాగ్ర
హార వంకాలపాటిశు(భా)పరాఖ్య
రామచంద్రపు(రా)భ్యర్ణ్ణసీమయంద్దు
విప్ర(స)త్ఫలసంధానవిమలమతిని.

సీ. కణ్ణాటభూపాలఘనకృపాక (లి)తవి
స్తీర్ణ్ణగజ ... ... ... ఒడ్డు
చండ ప్రతాపభాస్కరుండ్డు భాస్కరదండ
నాథుసోదరి మహోన్నతగుణాఢ్య
పూని షోడశ మహాదానవిద్యాప్రౌఢిం

జిరకీర్తి గనిమన్న చిన్నమాంబ
దుగ్ధాంబునిధితోడం దులదూంగు గోపికా
నాధసముద్రంబు నలువుమీర
ధరణిం గట్టించ్చె నాచంద్ర తారకముగ-
(అసంపూర్ణము.)

(ఈపద్యములలో మొదటిపద్యము మాత్రమే మాతృకనుబట్టి నేను వ్రాసినది. తగ్గినవి వంకాయలపాటి సత్యనారాయణ యనునాయన వ్రాసి పంపినవి. వీనిలోని వర్ణ క్రమ మెల్లెడల యథామాతృకమని చెప్పననువుపడదు. శ్రీనాథుని ఫిరంగిపుర శాసనపద్యముల ఛాయ పద్యములందు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది.)

## 81. దుర్గి

శ. స. ౧౪౭౫

(ఇది గుంటూరుమండలములో దుగ్గిగ్రామమందు వంకేశ్వరస్వామి గుడి ముఖ మండపమంలో నొకఱాతి స్తంభము మీఁదనున్న శాసనము. శ. స. ౧౧౬౩ ప్రాంతమందు రామ దేవపండితులు తమతండ్రి వాయిపండితుల పేర వంకేశ్వరదేవుని ప్రతిష్ఠచేసినట్లు మఱియొక శాసనమునందున్నది.)

సీ. కాకితాంన్వయుడైన[1]గణపతిదేవని
పండితుం డ్డగువాయిపండ్డితుండు
యేపార[2] దుగ్గెవంకేశ్వరదేవుని
ప్రితి[3] నూత్న నగరప్రతిష్ఠ శేశె[4]
క్రితము ముంన్నూ రేండ్లకిందట ఇప్పుడా[5]
నగరికంభము[6] ఱాలు పగిలియుంన్న
మలిపించ్చి తెప్పించి నిలిపించె కంభముల్[6]
తలప[7] గోచరమైన తరము లెత్తి
జగతి ఆచంద్ర[8] తారార్కమగుచు నెరయ
నికిలజను లలర ప్రఖ్యాతిని వహించె[9]
(భాగ్య సవుభాగ్యనిధి)[10] పరమ వైష్ణవసజ్జన పారిజాత
కోరి సద్గుణమణి పెదకూరపాటి(వంశాబ్ధచంద్ర)
దీపితోదారి మాదయగోపశవురి.[11]

ప్రమాదీచసంవత్సర పువ్యశు ౧౦ సో॥ కూరపాటి గోపినేండు దుగ్గెవంకేశ్వర దేవుని కంభం ప్రతిష్ట సేశను.

---

1. యుండైన- అని చదువునది.
2. ఏపార-
3. ధృతి అని యుండనోపు.
4. సేసె- అని చదువునది.
5. క్రిందట నిప్పుడా-
6. కంబము అని చదువునది.
7. తలంపం గోచరమై-"
8. నాచంద్ర- "
9. నిఖిలజగములం బ్రఖ్యాతిని వహియించె- అని యుండనోపు.
10. కుండలీకరణములు చేసినభాగములు విడిచినచో నైదు గీతపాదము లగును. పెక్కుచోటుల విసంధు లున్నవి.
11. శౌరి- అని చదువునది.

## 82. అహోబిలం

శ. స. ౧౫౦౦ ప్రాంతము.

(ఇది కర్నూలుమండలములోని ఎగువ అహోబలముందు అహోబలస్వామి యాలయముగోడమీఁద నున్న పద్యము. వ్రాఁతతప్పులు పెక్కులు గలవు. లిపిని బట్టి శాసనము ౧౫౦౦ ప్రాంతము దనవచ్చును.)

సీ. తిరిగెం గవ్వంబై శరధిలో నొకకొండ
వుగ్రునివిల్లయ్యె నొక కొండ
ఆలంగా(చు)టకై హరియెత్తె నొకకొండ
వుదధిలోపల దాంగె నొకకొండ
రయమునం బెకలించె రావణుం డొకకొండ
సృక్కెం గుమారుచే నొకకొండ
వరముని ఆజ్ఞ గవ్వా మణంగె నొకకొండ
వువ్వీం జుట్లువెట్టె నొకకొండ
వున్న కొండలుం గపులెత్తి రుదవిడిని
చారుధీరత నీతోడ సవతుశాయ
యెన్నివిధములం దలంచిన యింకం గలరె
అలఘుదోదాండ వీణెతిమయకొం(డ).

వ్రాఁతతప్పులు మెండుగా నుండుటచే వానిని సవరించి యిప్పటి వర్ణ క్రమానుసారముగాఁ బైపద్యము క్రిందఁ జూపఁబడినది.

సీ. తిరిగెఁ గవ్వంబయి శరధిలో నొకకొండ
యుగ్రునివిల్లయ్యె నొక్కకొండ
యాలఁ గాచుటకునై హరియెత్తె నొకకొండ
యుదధిలోపల దాఁగె నొక్కకొండ

రయమునఁ బెకలించే రావణు డొకకొండ
ప్రుక్కె గుమారుచే నొక్కకొండ
వరమునియాజ్ఞ గర్వ మణంగె నొకకొండ
యుర్విఁ జుట్టులు వెట్టె నొక్కకొండ
యున్న కొండలఁ గపులెత్తి రుద్దవిడిని
జారుధీరత నీతోడ సవతుసేయ
నెన్ని విధములఁ దలఁచిన నింకఁగలవె
యలఘుదోర్దండ వీణె తిమ్మయ్యకొండ.

## 83. అమీనాబాదు

శ. స. ౧౫౧౪

(ఈపద్యము గుంటూరుమండలములోని అమీనుబాదాగ్రామమందు మూలాంకురమ్మగుడి తూర్పు ద్వారము కుడి ప్రక్కను చెక్కబడియున్న శాసనములో నిమిడియున్నది. ఇది గోలకొండరాజయిన ఇభరాం (Ibrahim) పాదుషా గారి సేనానాయకుఁడైన అమిడ్ మలక (Amin-ul-mulk) గారు శ. స.౧౫౧౪ కు సరియైన నందనసంవత్సర వైశాఖ శు ౩ గురువారము నాఁడు చెక్కించిన ప్రతాపధర్మశాసనమని యున్నది. ఇభరాంగారు కొండవీడురాజ్యమును సంపాదించిన విషయమును జెప్పునవసరమున నీపద్యము చెప్పఁబడినది.)

"మొదలను శాలివాహనశకవర్షంబు లగు ౧౫౦౨ అగు నేడు విక్రమ సంవ్వత్సర చైత్ర బ ౧౪ భవుమవారంనాండు హజరత్ యిభరాహిం పాదశహ వొడయలుంగారు తమనామజాదు అంపితేను-

దాటగ[1] నేంగి వుద్దగిరి[2] దాకొ౯ని వెంకటరాజుం దోలి ముం
గోటలు లగ్గవట్టి వినికొండ్డయు బెల్లముకొండ్డ తంగ్గెడల్
పాటపరిన్ హరించ్చి మరి బల్మిని గైకొనె కొండ్డవీడు క
నాటక రాజధాని యిభరాముండు బాహుబలంబు మీరుచునూ,

యీలాగు ప్రతాపాన కొండవీంటి రాజ్యం పుచ్చుకొని రాజ్యం పరిపాలిస్తున్ను వుండ్డెను.

---

1. ధాటిగ- అని చదువవలయును.
2. యుద్ధగిరి- "

## 84. సిద్ధవటం

శ. స. ౧౫౨౭

(ఈశాసనము కడపమండలము సిద్దవటము ప్రోఁతకోటయొక్క తూరుపు ద్వారము గోడమీఁద చెక్కబడియున్నది. Government Epigraphst's Collection No. 564 of 1915.)

స్వస్తి.

శాకే శాంబ్బక[1] బాణభూపరిమితే వ(ర్షే చ వి) శ్వావసౌ
వౌన్న త్యేన చిరాయుషాచ గుణభాజా చంద్ర తారం భువికి
యస్యా నంత్తనృపేణ తేన జనకే నైవోటుకూరీరణే
ప్రాప్త స్సిద్దవటో య ముజ్వలశిలాసాలో విశాలః కృతః॥

సీ. (శాలి)వాహన నామశకవర్షములు వేయు
నేనూంటయిరువదియేడు చనిన
విశ్వావసు వసంగ్గ వెలయు వత్సరమున
సకలహిందూరాజ్యసార్వభౌమ
వీర వేంకటరాయవిభుండు చంద్ర (గిరీంద్ర)
సీమసామ్రాజ్యంబ్బు సేయుచుండ
జంబ్బులమడకభూసంగ్రామజయశాలి
కటకపురీచూర కారహారి
నందేల క్రిష్ణమనరనాథభయదాన
దక్షదోర్దండ విచక్షణుండు
అఖిలకర్న్నాటసింహాసనాధీశ్వర
దక్షిణబాహాభిధానధారి
విదళితకొంండ్రాజువెంకటాద్రివిభుండు
చెంన్నూరిహరణసంపన్నగృహుండు
విబుధస్తుతకకుస్థవిజయప్రబంధాది

కావ్యనిబంధన గ్రంధకర్త
శ్రీమదెల్లమరాజు చెరువు(పే)ర తటాక
ఘటనానుభావసంఘటితయశుండు
ద్రవిడభూమధురాదిధాటీచలద్రయ
బలరక్షణాక్షీణబాహుబలుండు
పెనుగొండ్డసమరయావనపాదుషాగర్వ
ఖర్వీకరణచణాఖర్వ భుజుండు
ర(ం)గమాంబ్బాకుమారవతంసరత్నంబ్బు
పరభీమబిరుదులభాయిబండ్డి
విమతావనీశ్వరవేశ్యాభుజంగుండు
బల్లరగండాంకభాసురుండు
మన్నెహంవ్వీరుండు మగలరాయండు(రా)చ
బెబ్బులి పరరాజభీకరుండు
మట్టి తిర్వేంగళమానవాధిపరత్న
రత్నాకరుం డనంత్తరాజశౌరి
తమతండ్రి యల్ల భూరమణుండు ...
తిరుపతి రాజుపైం బెరిగి కొట్టి
తనకత్తిమొనం దెచ్చుకొనిన(సి)ద్ధవటంబు
చెల(ంగత)[2] నపేర చెరువు సేసె
హృదయముప్పొంగ సిద్ధవటేశ్వరునకు
ఔపచారికమైన సాలాంత్తరముగ
పురము చుట్టును వరణమై పరిణమింప్ప
ధాత్రిం గట్టించే నాచంద్ర తారకముగ

---

1. శాకేద్ర్యంబక - అని యుండనోపు.
2. చెలంగంగం దనపేర-అని చదువునది.

## 85. కల్లూరు

శ. స. ౧౫౩౪

(ఈపద్యము నెల్లూరుమండలములో ఆత్మకూరుతాలూకా కల్లూరు గ్రామమందు శివాలయమదగ్గరనున్న యొక ఱాతిమీద చెక్కఁబడియున్నది. పద్యమునకుఁ బూర్వ భాగమునందున్న వచనములో "శాలివాహనశకవవంబులు ౧౫౩౪ అగు నేంటి పరిధావిసంవత్సర కార్తీక బ ౧౨ సో" నాఁడు చింతపట్ల రుద్రప్పనాయఁడు అనంత సాగరమను చెఱువు తూర్పుటలుఁగునకు "ముప్పమూడు శిలాస్తంభాలు నిలిపి యిరుగడల సంతనిసారువులు సౌపానాలు కలుగు" కట్టించి నట్లున్నది- నెల్లూరి శాసనములు- ౧౨౪౫)

సీ. అవగాహనేహాసమాయాతవిబుధరా
 ట్కమనీయ్య[1] మణిశతాంగము లనంగ
తాటాకసేతుసందర్శనేచ్ఛాగత
 స్థితసమున్నతమహాశిఖరులనగ[2]
నీతినుజ్వలదశానేతృసంపాదిత
 మూర్తీ భసత్కీర్తిమాతృలనగ
ముక్తామణీయుక్త మోహనాంబరచుంబ్బి
 వరుణరాజన్యగోపురము లనగ[2]
నిలిపెం గుల్లూరి నల్ల చెర్వలుగునంద్దు
ముప్పదియుమూడు[3] రాకంబములుం జెలంగ
చింతపట్లపురస్థాయి శ్రీనిధాయి
రుచిరగుణహారి చెంచయరుద్రశౌరి.

---

1. కమనీయ- అని చదువవలయును.
2. లనంగ-
3. మూండు

## 86. అమరావతి

శ. స. ౧౫౪౫

(ఈ పద్యములు గుంటూరుమండలములో అమరావతి గ్రామమందు అమరేశ్వరుని యాలయము మండపములో నొకఱాతిపలక మీఁద చెక్కఁబడియున్న శాసనములో నున్నవి. Government Epigraphist's Collection No. 260 of 1897)

ఉ. యింద్రుండు ధాన్యవాటి నమృతేశు ప్రతిష్ట యొనచ్చె౯ పంటరె
డ్డీంద్రుండు అన్న వేమధరణీశ్వరుచేశె పునఃప్రతిష్ట ఆ
చంద్రదినేంద్ర తారకము శాశ్వత మవునని యీశ్వరాజ్ఞ చే
హంద్రికే పెద్దమంత్రి సుగుణాంబుధి నిల్పెను సుప్రతిష్ఠయును.

చ. వరవసువేదబాణశశివన్నిౕతమౌ శకవత్సరంబులను
అరయంగ అక్షయాబ్దమున హంద్రి కెకోనయ పెద్దమంత్రి యి
ద్ధరవిచంద్ర తారకము దన్నలకోట అమరేశలింగమును
స్తిరతరభక్తితోడ ప్రతిష్ట యొనచ్చె౯ పుణ్యశాలియై.

ఈ పద్యములందు దోషములు మెండుగా నుండుటచే వానిని సవరించి యిప్పటివర్ణ క్రమమును బట్టి యీ క్రిందఁ జూపుటయైనది.

ఉ. ఇంద్రుఁడు ధాన్యవాటి నమృతేశుఁ బ్రతిష్ఠయొనర్చెఁ బంటరె
డ్డీంద్రుఁడు అన్న వేమధరణీశుఁడుచేసెఁ బునఃప్రతిష్ఠ యా
చంద్రదినేంద్ర తారకము శాశ్వతమౌ నని యీశ్వరాజ్ఞచే
హంద్రిక పెద్దమంత్రి సుగుణాంబుధి నిల్పెను సుప్రతిష్ఠయున్.

చ. వరవసు వేద బాణశశివర్ణితమౌ శకవత్సరంబుల
న్నరయఁగ నక్షయాబ్దమున హంద్రికె కోనయ పెద్దమంత్రి
ద్ధర రవిచంద్ర తారకము దన్న లకోటమరేశలింగమున్
స్థిరతరభక్తితోడను బ్రతిష్ఠ యొనర్చెను బుణ్యశాలియై.

## 87. నందిగామ

శ. స. ౧౬౦౦

(ఇది కృష్ణామండలములో నందిగామగ్రామమందు రామలింగేశ్వరస్వామి గుడి మండపములో నొకఱాతి స్తంభము మీఁది శాసనము. Government Epigrphist' s Collection No. 252 of 1924)

చ. అరయంగ శాలివాహనశక* హాయనముల్ వెయినారునూరువో
మరిదగు పింగ్గళాబ్దమున మాఘమునందలి శుద్ధపంచ్చమిన్
విరివిగ వాశిరెడ్డి ఘనవీరయరామన నంద్దిగామలో
స్మరహరుకై యొనచ్చెఁ ముఖమంటపమా శెశి[v]భాస్కరంబ్బుగనూ

---

* శాలివాహశక - అని చదువవలయును.

[v] శశి- అని చదువవలయును.

## 88. బెజవాడ

శ్రీ ముఖ.

(ఈశాసనము కృష్ణామండలములో బెజవాడ గ్రామమందు మల్లేశ్వరాలయములో విఘ్నేశ్వరునిమందిరము నెదుట నొకఱాతి స్తంభముమీఁద చెక్కఁబడి యున్నది. శక సంవత్సరము లేదు. South Indian Inscriptions Vol. IV. No.775)

శ్రీముఖ సంవత్సర మాఘ౦శు ౫ ఆ దాసమహంతి కుమారుడు శివమహాపాత్రుని అంన చొకాఇపాత్రుడు మల్లేశ్వరుని గుళ్యోని కేశవనాథని గుడి సుంనం శేయించెను॥

శా. ఔరాదాసయచొక్కపాత్ర(ం)డుసమోంన్నత్యదానవారాశి(యై)[1]
శ్రీ) రంజిల్లె (డి)మోటురీపురి(ం) బ్రతిష్ఠించేన్ ముదంబొప్ప(ం)గాం
దారేందుగ్రహసూర్య(మై) వెంచి[2] దక్షాధ్వరధ్వంసునిన్
కారుణ్యాకర[3]మానసాంబురుహిణీకల్యాణ[4]వీరేశ్వరున్.
శ్రీశ్రీశ్రీ జేయునున్.

**సంపూర్ణము.**

---

1 పాత్రుండసమానౌన్నత్యవారాశియై- అని యుండనోపు.

2. వెలయంగా- అని యుండనోపు.

3. గారుణ్యాకర- అని చదువునది.

4. మానసాంబురుహునిం గల్యాణ- అని యుండనోపు.

145

జయంతి రామయ్య పంతులు గారి

# శాసన పద్యమంజరి

(ద్వితీయ భాగము)



సంపాదకులు

డా. ఈమని శివనాగిరెడ్డి-స్థపతి

డా. కె. శ్రీనివాసులు

డా. జి. వి. పూర్ణచందు

కార్యనిర్వాహక సంపాదకులు

డా. దీర్ఘాసి విజయభాస్కర్

ప్రచురణ

**ఆంధ్రప్రదేశ్ సృజనాత్మక & సంస్కృతి సమితి**

**అమరావతి-2018**

# శాసన పద్యమంజరి.

## ద్వితీయభాగపీఠిక.

ప్రాచీన శిలాశాసనములలో నున్న తెలుఁగుపద్యములు కొన్ని యిదివఱలో "శాసనపద్యమంజరి" యను పేరఁ బ్రకటించియున్నారము. ఆమంజరిలో 88 శాసనములలో నిమిడియున్న ౨౮౭ (287) పద్యములున్నవి. వానిలో మొదటిశాసనము ౭౭౦ (770)వ శాలివాహనశక సంవత్సర ప్రాంత మందును జిట్టచివరిది ౧౬౦౦ (1600)వ శాలివాహన శక సంవత్సరప్రాంతమందును బుట్టినవి. ఆ పద్యములు ప్రకటించిన పిదవ లభించిన పద్యముల నిప్పు డామంజరిలోనే ద్వితీయ భాగముగాఁ బ్రకటించు చున్నారము. ఇందు ౪౬ (46) శాసనములలోఁగల ౯౫ (95) పద్యము లున్నవి. ఈశాసనములలో మొదటిది ౧౦౪౬ (1046)వ శక సంవత్సరములోను జివరది ౧౭౩౨ (1732)వ శక సంవత్సరమునఁ బుట్టినవి. ఈ రెండు భాగములలోని పద్యములను గలిపి కాలానుక్రమముగా నేర్పఱించి యొక సంపుటముగాఁ బ్రకటించుట యుక్తముగా నుండెడిది. కాని ప్రథమభాగము పుస్తకము లన్నియు నమ్ముడుపడకుండుటచే నట్లు చేయుటకు వీలు లేకపోయినది. ఇప్పుడు విడివిడిగా నుండుభాగములు రెండును వ్యయమైన పిదప నా రెండు భాగముల పద్యములను గలిపి యొక పుస్తకముగా ముద్రించెదము.

ఈశాసనములలోఁ గొన్ని "South Indian Inscriptions"(దక్షిణహిందూస్థాన శాసనములు) అనుగ్రంథములనుండి గ్రహింపఁబడినవి. ఈవిషయ మాయాస్థానముల యందు వక్కాణింపఁబడినది. ఇవి గాక తక్కిన శాసనములన్నియు శాసన ప్రతిబింబములను బట్టి ప్రతులు వ్రాసినవియే.

పద్యములు శాసనములయందున్నవి యున్నట్లే ముద్రింపఁబడినవి. ప్రాచీన గ్రంథ లేఖనసంప్రదాయమునుబట్టి పాఠకులు తమంతటఁ దాము సవరించుకొనఁ దగిన తప్పులను విడిచి పెట్టి మిగిలినవానికి సరియైన పాఠములు పుటలయడుగునఁ జూపఁబడినవి. ఈవిషయమందును, ఇతర విషయములందును గూడఁ బ్రథమభాగ విషయమున గమనించిన యేర్పాటులనే యీభాగవిషయమునఁ గూడ గమనించినారము. ఈ రెండు భాగములనుజేర్చి యొక గ్రంథముగా భావించి చదువుకొనుట యుచితము.

-జ.రామయ్య

# శాసన పద్యమంజరి

## ద్వితీయభాగము.

## **89.** నాదెళ్ళ

శ. స. ౧౦౪౬

ఇది గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోని నాదిండ్ల గ్రామములో నొక పొలములోఁ బడియున్న భిన్న మయిన యొక ఱాతిమీఁద చెక్కబడియున్నది. (A. R. 395 of 1915.)

శా. శ్రీమద్ధర్మ్మపరాయణులు బుధజనాశీర్వ్వాదవంతులు దయా
ధాములు సర్వ్వజనానురక్తు లఘువిధ్వస్తాత్ము లుద్యద్యశో
రామారాములు వైశ్య వంశులు[1] గుబేర ప్రాభవులు గోమినీ
భామాధీశ పదాబ్జభక్తులు జగత్ప్రఖ్యాత తేజోధికులు. 1

ఉ. లాలిత విత్త దాస్వయలలాముఌ పుణ్యయశోధనుఌ మొ
క్కోలకులోత్తముఌ పెనుంగొణ్డవిభుఌ ప్రభుఌ సత్యవా
క్శీలులు ధారుణిం గొసని సెట్టికిం బ్రోలమకును సుతుఌ ల
క్ష్మీలలనేశ్వరస్మరణ సేముషి గోమసయును ముదంబుతోను. 2

మ. ధరణీశోత్తము ఖణ్డనశ్రీశకనృపాబ్దంబులు రసోదస్వదం
బర చంద్రస్థితసంఖ్య మాఘసితశుంభత్పంచమిం బార్వ్వతీ
శ్వరు విశ్వేశ్వరు భక్తితో నిలిపి విశ్వస్తుత్యులై దేవమం
దిర మెత్తించిరి వంశవర్ధనులు (నాది)ణ్ణం జిరస్థాయిగాను. 3

---

1. వంశ్యులు- అని యుండవలెను.

## 90. తూబాడు

శ. స. ౧౦౫౪

ఇది గుంటూరుజిల్లా నరసారావుఁపేట తాలూకాలోని తూబాడు గ్రామములో వినాయకుని యాలయము గర్భగుడి సమీపమున నిల్పఁబడిన నాగశిలమీఁద చెక్కఁబడి యున్నది. (A. R. 441 of 1915.).

క. శ్రీసహితుండు దూంబఱితిసు
శాసనుం డనియంక భీము చక్రమ లీలా
వాసుండు సతుర్థ[1]కులగిరి
కేసరి గాపండు జగజ్జిగీషుండు పేర్మిని. 1

చ. అడపము నందలంబు వివిధాతపవారణకాహళావలిం
బడియము నాదిగాంగల న్రిపాలక చిహ్నాలు బుద్దవర్మచేం
బడసినవాడు నాయకసభామణి సి(ద్దప) నాయ కాంకుం డి
ప్పుడమిం దదీయవీర భటపుంగ్గవుమనుమం డుదాత్త సంప్పదను. 2

క. సేవనియు సింగనయు జగ
దేవండుం (జోడ్ల) నుం[2] జూడ దీరిక మండ
క్ష్మావలయేశ్వరుపన్పునం
బావని రఘునాథుచేతం బనివడిన క్రియను. 3

శా. తన్నగ్గించుచు నెఱ్ఱమండణ్డు బుధధారుండు వస్పంగ న
మన్నే (ట)ంగనయంబుల న్రిపులకు న్మామ్నెట్టి యోడించ్చి పే
కొర్న్న స్మణ్ణనగంధవారణసమాఖ్యుం జేసి తూంబత్తిపై
నెన్న న్రిత్తి గ నాతుకూరు దయతో నిచ్చె న్ని జస్వామియును. 4

చ. శక సమసంఖ్య వారినిధిసాయక ఖేందు మితంబుగాంగ గా
ర్త్తికసితపక్ష తేరసముం దీవ్రకరాము[3]నం దఖండదీ
పకమును సీతి[1]ఖండువులు భాతిగ వ్రిత్తియు (చం)ద్రసూర్య్యతా
రకముగ న్రిత్యవాద్యములు రాగముం గూడంగ నిచ్చే శూలికిని. 5

చ. కర ముచితంబుతో నగరగాం ద్దదుగం జనగాద్యయెక్క శు
స్థిరమగు నాదివారమున చిందమలాడిన నెజ్జ నుణ్ణండిం
బరగిన యట్టి కాపనకుం బంకజలోచన (మ)ండమాంబకుం
దిరముగం బుట్టెం గాపం దవధీరితపావనినాం బ్రసిద్ధుండై. 6

ఉ. శ్రీ వెలనాంటి గోంకన్రిపశేఖరు శ్రీకరుసిద్ధిబేతవి
ద్రావణరావణాంతక పరాక్రము విక్రమచక్రి భూరి తే
జోవిభవాభిరాముం దగు చోడన చక్రముం గొల్చి తత్రృపా
దావహలీలం దాల్చిన మహోత్ముణ్డు గాపందు ధర్మ్మశీలుడై 7

క. చిరముగం దూబఋత మ హే
శ్వరునిం బ్రతిష్టించి రజత శైలము నా భా
సురముగ గుడి యెత్తించెను
గురుమతియై కాపనాయకుం దతిభక్తిని. 8

---

1. చతుర్థ అని యుండవలెను.
2. ఈయక్షరములు స్పష్టముగా లేవు.
3. దీవ్రక రాహము- అని యుండనోపు.
4. దీపకమునశీతి అని యుండనోపు.

## 91. వలివేరు

శ. స. ౧౦౬౪

ఇది గుంటూరు మండలములో తెనాలితాలూకా వలివేరు గ్రామములో స్వయంభ్వేశ్వరస్వామి దేవాలయము నెదుట నొకఱాతిమీఁద చెక్కబడినది. (A. R. 676 of 1920)

శా. శ్రీరమ్య(ండ)గు గుండ్యబోయునికి సంసిద్ధంబుగా నుర్వ్వరను
శ్రీరామానిభదామమాంబికకు సత్సేవ్యుండు భవ్యుండు వొ
ల్పారం దా నుదియించే బోయు(ం)డెటియండాగుప్తజుం డాయనను
శూరత్వంబున దానశక్తినిం బ్రభను శుద్ధాత్మికను దీరికను. 1.

పెబై నఖండదీపములు వేర్కఁలరావుల నెల్లం దన్నుం ఓం
బట్టిన యాశ్రితులు[1] బుధులు[2] బుధులం జేకొని ప్రోచె వైరులను
మెట్టి ధరిత్రియెల్ల నిరమిత్రము సేయంగం బూఎం బేర్మిఁతో
దట్టుండు గోంకభూపతికిం దామ వరపుత్రుండు సచ్చరిత్రమెయిని[3] 2

క. జలధిరసఖేందుశక సమ
ములుగా నేటియందు మకరమున సంక్రాంతిని
వలి వేరి[4]భండారికి ని
శ్చలమతి దీపంబు నిలిపెం జంద్రార్కఁముగాను. 3

1. ఛందస్సుచే యా శ్రితుల్ అని ప్రథమాంతముగాఁ జదువవలెను. కాని

---

యన్వయము కుదరదు.

2. బుధుల-అని యుండవలెను.
3. మైన్ అని యుండవలెను.
4. వలివేర్ -అని యుండవలెను

## 92. ఘంటసాల

శ. స. ౧౦౬౬

ఇది కృష్ణాజిల్లా దీవితాలూకా గంటసాలగ్రామములో జలధీశ్వరస్వామి యాలయము నెదుట నున్న యొకపాలఱాతిమీద చెక్కఁబడినది. (A. R. 848 of 1917)

చ. (మతలుకటిం)పగా శకసమంబులు దక్కఁరసాంబరేందుసు
మ్మితముగ నుత్తరాయణనిమిత్తమునం దతిభక్తి బార్వఁతీ
హితునకు ఘంటశాలజలధీశ్వరదేవర కాదిమూర్తిఁ
నమసుర చక్రవర్తికి మనఃప్రభవారికిం జంద్రమౌళికిన్ 1

చ. ధ... ... ... వర్ధఁ నసుధాకరుం డెఱ్ఱమసె ... ...
... ... ... వనజాయతాక్షి యనంగాందగు ...... పుత్రుండై
తనకును దల్లిదండ్రుల ... ... వుగాం బెనుంగొండ శాసనుం
డ ... ... గోటకొమ్మన గుణాఢ్యు ... ... త్రయిన్ 2

క. ఆపురహరునకు వల పల
దాపల శాశ్వతములై బెడగడరంగా
దీపింపంగ వేంగినకుల
దీపకుండై రెం డఖండదీపము లిచ్చెన్ 3

క. ఈగిరిశుదక్షిణోత్తర
భాగముల నహర్నిశములుం బాయక వెలుంగును
శ్రీగుణమణభూషణ ...
రాగముతోం (గో)రి ధవ... 4

## 93. ఘంటసాల

శ. స. ౧౦౬౬

ఇది కృష్ణామండలము దీవితాలూకా గంటసాలలో జలధీశ్వరస్వామి యాలయములో నొక పాలఱాతి స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 848 of 1917)

చ. ... ... దింపంగా శక సమంబులు దక్క కారసాంబ రేందుస
మ్మితముగ నుత్తరాయణనిమిత్త మున(o) దతిభక్తిం బొవ్వ్రతీ
హితునకు ఘంట్టశాలజల(ధీశ్వ)ర దేవర కాడిమూర్తి కా
నమసుర చక్రవర్తికి మనః ప్రభవారికిం జంద్రమౌళికిన్. 1

చ. ధనద (కులాబ్ధి) వర్ద్ధనసుధాకరుం డెట్టమ సెట్టికి ...
వనజయతాక్షి[1] యనంగా[2] దగు (పమ) ... సుపుత్రుండై
తనకును దల్లిదండ్రుల (కుధర్మ్మ)వుగాం బెనుంగొండ శాసనుం
... ... ... ... ... కొమ్మనగుణాఢ్య ... ... డిత్రయిన్. 2

క. ఆపురహరునకు(వల) పల
డాపల శాశ్వతములై బెడంగడరంగ్గా
దీపింపంగ వేంగినకుల
దీపకుండై రెండు ... దీపము లిచ్చెన్. 3

క. ఈగిరిశుదక్షిణోత్తర
భాగముల నహర్నిశములుం బాయక వెలుంగను
శ్రీగుణవణి భూష(ణుండ)ను
రాగముతోం గోరి ధర్మ్మర ... ... 4

1. వనజదళాయతాక్షీ అని యుండవలెను.

---

2. ఇచట వకార గకారములకు మైత్రికల్పింపఁబడినది, దీని సాధుత్వము చింత్యము

## 94. తిమ్మాపురం

శ. స. ౧౦౮౩

ఇది శాసనపద్యమంజరి ప్రథమ భాగములోని 46వ శాసనము చివర భాగము. ఈశాసనము గుంటూరుమండలము నరసారావుపేఁట తాలూకా తిమ్మాపురము గ్రామము వీథిలో నొక నాగస్తంభముమీఁద చెక్కఁబడినది. (A. R. 443 of 1915)

క. పరమపరుండై న గొంకీ
స్వరునిం బ్రతిష్ఠించి ధర్మ్మపరుండై లక్ష్మీ
పరుండై సొక్కమసరణయ
ధరదానము భూసురులకు దత్తము సేసెను. 17

క. పరిమల ... ... ...
పరగి పంచమహాశబ్ద[1] ప్రణవంబులతోం
గర మొప్ప ధూపఘంటెయు
సరనయ గోంకీశ్వరునికి (శ్య)ము యిచ్చెను. 18

క. యవడిల[2] దూబ వాడం
గ్రమమున పణ్డీస్వరమునం గదు ధన్యముగా
నమరం గొఁకీస్వరునికి
విమలంబగు దీపవర్త్తి వెలయంగం బెట్టెను. 19

క. గుడియును జెఱువును వనమును
నడరిన నల్లిండ్లుం గ్రితియు న(ల?) పెన్నిధియునుం[3]
గొడుకులను సప్తసన్తతి
నొడంగూడంగ నిలిపి సరనం డొప్పెం గీర్త్తిని.

---

1. పంచమహాశబ్ద-అన్న చో గణము తప్పినది.

2. ప్రాసము తప్పినది .

3. పెన్నిధియున్ - అని యుండవలెను.

## 95. పాలకొల్లు

శ. స. ౧౦౯౧

పశ్చిమగోదావరీ మండలములో పాలకొల్లు గ్రామమందు శ్రీరామేశ్వరస్వామి యాలయప్రాకారములోపల నొకస్తంభము మీఁద చెక్క బడియున్నది. South Indian Inscriptions Vol. V. No. 163

క. శ్రీరమణీయుండు సుజనా
ధారుండు విబుధనుతగుణనిధానుండు విజయ
శ్రీరమ్యమూర్తిఁ గేతమ
గారాపుందనూజుం డభయకరుండు వొగడ.[1] 1

క. వెలనాంటికిం దొడ వనంగా
వెలసినకుఋంగడలు గలుగు వీరుండు నిజదో
ర్బ్బలములను[2] బలిమియుం బాడియుం
గలవాం డధికారపదవి గలవాండు మహిని. 2

తరు. శకమహీపాలక సంవత్సరములు
శశినిదివియదిందు సంఖ్యగాం గీర్తి
సురుండు రాజేంద్రచోడనియిష్ట
సుభటుండ్డు వెంగ్గడయ[3] సుతుండు సూర్య్యాఁకుం
డకలంక్కుం డైనక్షీరారామదేవుం
డగుశంబునకు భక్తుండై శనిభవని
ప్రకటింప నిష్కసప్తక మిచ్చే మొట్ట
పఱితి కాంపులకునుం బరగుసానులకు.

---

1. గణము తప్పినది, కరుండువొగడంగన్- అనియుండనోపు.
2. బ్బఁలమును అని యుండవలెను.
3. వెంగ్గయ-అని యుండనోపు.

## 96. పాలకొల్లు

శ. స. ౧౧౯౧, ౧౧౯౩

పై స్తంభముమీఁదనే చెక్కఁబడి యున్నది.

శ్లో. శ్రీశాకేశ్వరవత్సరే విధునిధివ్యోమేందసంఖాన్వితే
కార్తీ క్యాం రిపురాజభీకరశరస్సోయ న్నరేంద్రాగ్రణీః
క్షీరారామనివాసినే భగవతే సెర్వ్వాయ[1] సర్వ్వాత్మనే
ప్రాదా దాశశితారకం గుణనిధి ర్ద్దీపా వఖండ్డా ముదా.

క. శ్రీయుతవక్షు శ్రీవరకవి[2]
గాయక నిధి సుంద్దరాంబిక సుతుండు(ను)[3]
శ్రీయుక్తుం డనంగ నెగడిన
రాయపనాయకునికాన్త రాజాస్య మహిని.

సీ. గుణనిధివియదిందుగణన శకాబ్దంబు
లమరంగ్గ నుత్తరాయణనిమిత్త
మగుపుణ్య దినమున న్జబాస్య నాచినా
యకునకుం జిన్నమాంబకుం దనూజ
ప్రోలమ గణికావిభూషణి భక్తిం ద
న్నేలినహరున కద్దెందుమాని[4]
కహిభూషణునకు క్షీరారా మవరపుర
పతికి నఖండదీపంబు నిలిపె.
దీని జేకొని నడపంగ్గంబూజితి నిందు
వెలసి యెప్పుడుం దమసానివృత్తింగా జే(ను)[1]
కంటనకు నగ్రజుడు జక్కనఘనుండు
దరతరంబులు నాచంద్రతారకముగా.

---

1. శర్వ్వాయ-అని యుండవలెను. 3. గణము తప్పినది.
2. వక్షుండు వరకవి అని యుండనోపు. 4 కర్ధేందుమౌళి అని యుండనోపు.

## 97. ముఖలింగం

శ. స. ౧౦౭౦ (')

ఇది గంజాముమండలము, పర్లాకిమిడి తాలూకా ముఖలింగములో ముఖలింగేశ్వరస్వామి యాలయములో, ఆస్థానమండపము, ఎడమవరుస మూఁడవ స్తంభముమీఁద దక్షిణము వైపున చెక్కఁబడి యున్నది. (South Indian Inscriptions Vol. V. No. 1075.)

సీ. శ్రీకర శుభకరశా(కా)[1]బ్దములు వియ
న్మారుతవ్యోమసంస్తుతముగ
సితతరైకాదశి నుతభౌమదినమునం
(గాని)[2] మాసంబునం గంసరిపుండు
(పా)లమున్నీరిలోం (బ) వ్వడించిన (తి) థిం
బితృదేవతల కతిప్రీతిగాంగ
విశ్వేశండగు మదుకేశ్వర దేవర
(కా) చంద్ర తారక మగుచు న(మ్మి)
దివ్యమగు నఖణ్డదీపంబు వెట్టెజు
ట్టేశు కట్టానుంగ్గు[3] సాసనికుండు
ధీయుతుండ్డు గాపినాయకుకూరిమి
తమ్ముం డెటి ..... యన్వితుదమ్మఁనుతుండై.[4]

---

1. వృత్తింగాను అని యుండనోపు.
2. కానిశబ్దము శూన్య మనునర్థమందుఁ
ప్రయోగింపఁబడిన దని తోఁచుచున్నది.
3. కట్టనుంగ్గు అని యుండవలెను.
4 నుతుండు అని యుండవలయును.

## 98. రాజమంద్రి మ్యూజియం

శ. స. ౧౦౨౧.

ఇది రాజమహేంద్రవరములోని చిత్రవస్తు ప్రదర్శనశాలలోని గిడ్డంగిలోఁ బడియున్న ఱాతి స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 40 of 1912.)

స్వస్తి శ్రీశకవర్షములు ౧౦౨౧ ణ్డగు నేంటి సూర్య్యగ్రహణనిమిత్తమున శ్రీమన్మహామండలిక బొద్దన కొడ్కు నారాయణ దేవనిప్రధాని దత్యపెగ్గడ సోమన పట్టిసమున వీరభద్రేశ్వర మహాదేవరకు నఖండదీపమునకు నిచ్చిన మోదాలు ౫౫ వీనిం జేకొని జన్ని బోయినియడపున అప్పన బోయినికొడ్కు సూర్య్యబోయుండు తనపుత్రానుపౌవుతిక (ము) ఆచంద్రార్క్కము నిత్యమానెణ్డు నెయి వోయంగలవాణ్డు.

సీ. భీమాపురము డాక రేమియు(న) మాడాలు
గుడిపూండి యునుం బాలుకొలన వీర
భద్రేశ్వరంబున భావపట్టునం దాఁబ్ర
పురిం బి( ) పురమునం బరంగు దూబ
ఘంటశాలాపురిం గౌతరంబునను నే
లీశ్వరంబునను వేగీశ్వరమున
విజయవాటిక నుండవిల్లిని వేలుపూరం
గర మొప్ప గొంటూరం గడలివల్లి
కనకవలయములును ఘనలోహవరదండ
ములు నఖండదీపములునుం బెట్టి
మ(ఱ)లం బెక్కు గుడ్లుం జెఱువులు గొంటూర
నిలిపే మం(త్రి)ంమం(తి)ం (షు)భుజుండు[1] 1

.. భారద్వాజపవిత్రగోత్రుం(డు) జగత్ప్రఖ్యాతిగాం బెట్టం బు
ణ్యార(ం)బ్బుం దొరిగాండివల్లభుండు దత్తామాత్యసోముండు దా
క్షారామప్రముఖోల్లసత్ప్రకటపంచారామతీర్థంబులన్
సారాఖండదశాప్తదీపకము లాచంద్రార్క్కతారంబుగాను. 2

---

1. ఈపాదము స్పష్టముగా లేదు.

## 99. బెజవాడ

శ. స. ౧౦౭౧

ఇది బెజవాడలో మల్లేశ్వరస్వామి యాలయము నుత్తరద్వారమున నున్న మండపములో నొక స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. (A. R. 323 of 1919.)

సీ. శరగిరిగగణేదుసమ్మితసక రాజ
వత్సరంబులు బెజవాడ(ఏ)లు
నయనిధి బొద్దననారాయణుని ధనా
ధ్యక్షి నాగార్జునుం డతని అత్త
గంటమ నిజకులకమలినీకలహంస
గుణగణాలంక్రిత గోరి నిల్పె
మల్లేశ్వరునకు సామజదైత[1] చమ్మాఁంబ
రున కద్రికన్యావరునకు లలిత
ఖండశశిధరున కఖండద్వీప[2] జ్వాల
(ఒ) నరి యొప్పి లీలం దనరి వెలుంగ
నచ్చఁ లిచ్చి కొ(ల్వ) నవితరభక్తి నా
చంద్రతారముగం బ్రశస్తముగను. 1

---

1. దైత్య- అని యుండవలెను.
2. దీప- అని యుండవలెను.

## 100. నాదెంళ్ళ

శ. స. ౧౦౭౫

ఇది గుంటూరుమండలము, నరసారావు పేఁట తాలూకా నాదెండ్ల గ్రామములో మూలస్థానేశ్వరస్వామి యాలయములో ముఖమండపము కుడిప్రక్క రెక్కతలుపు మీఁద చెక్కబడి యున్నది. (A. R. 330 of 1919.)

క. శ్రీరమణీరమణియ్యా
కారమహోదారధర్మ్మగౌవురవ[1]కులని
స్తార యనం బరగు బుద్దన
సూరబుధాధార ప్రియవ చోరమ్య మహిని. 1

క. బాలేందు శేఖరునకుం గ
పాలికి శూలికి లసత్కపర్ద్దికి ద్రిజగ
త్పాలి(తుం?) డగు నాదిండ్ల[2]
మూలస్థానుం డగు శంభుమూర్త్తికిని[3] 2

చ. అమితగుణాభిరామసుగుణాభరణాభరణాభిరామదా
మమవరపుత్రి సూరమ రమారమ(ణీని)యశ్రీ ... దా
నమహి(మ) ... ... మెయి[4] నెగడి నాదిండ్ల[5] ... శశిమౌళికి ...
............... ... ముదమొప్ప(ంగ) నిల్పె(ం) బొల్పుగాను. 3

స్వస్తిసక వర్షంబులు ౧౦౭౫ అగు నేంటి ... సంక్రాంతినిమిత్యమున ........ నాదిండ్లమూలస్థానమహాదేవరకు అఖండవర్త్తి దీపమున (కుం) బెట్టిన బిరుదు గద్యలు పంద్రెండు.

---

1. గౌరవ- అని యుండవలెను
2. ఇచట గణము తప్పినది.
3. ఒకగణము లోపించికది.
4. మై- అని యుండవలెను.
5. నాదిడ- అని చదువవలయును గాఁబోలు.

## 101. పెరవలి

శ. స. ౧౦౭౮

ఇది గుంటూరుమండలములో తెనాలితాలూకా పెరవలి గ్రామములో మల్లేశ్వర స్వామి గుడి ప్రాకారములోపలనున్న యొక్క ఱాతిస్తంభముమీఁద నున్నది. (A. R, 664 of 1920.)

క. శ్రీరమణుండుశౌర్య్యగుణో
దారుండు గొంకవిభుమామ తప్పితరిపుసం
హారుండు ధీరుడనందగు
మారయ పండండు గీర్తి మండనుండు మహిని. 1

క. అనందగు దండేశుప్రియాం
గన గొమ్మమ విఖ్యమిత్రగణపరివారం
బున కెల్లను హ్రిదయానం
దనకారి యనంగ నెగడె ధారుణిమిందను. 2

క. ఘనుండు నిడుమ్రాని కొమ్మయ
కును లీలావతియు ధైర్య్యగుణవతి యని పెం
పున నెగడిన మల్లాంబిక
కురు సుత యనంగ బరగి[1] ధైర్య్య గుణసంస్తుతితోను. 3

సీ. వననిధి వేష్టితావనిలోనం గలయగ్ర
హారంబులకు మణిహారలీల
మానైన పెరవలిమాధవ దేవర
కెత్తించే గుడి భక్తి యె(సం)గం గొమ్మ
మాంబిక తత్సూనుం దరు(చోడ)దండేశుం
డట్టెవునకు[2] నివేద్యమున కర్తి
తో రాజితంబగు నేరడ్ల చెఱ్వునా
గ్నేయ ... కు నంగడు నాయితముగం

బరగం( బాద) ... ఖ్యనిరువుట్టి భూమి ర
వీందుతారకముగ నిచ్చెం ద్రైశ
తాగ్రజన్మ సమితియనుమతంబున శకా
బ్దము విభాద్రిదిగ్మితమున వెలయ. 4

వ. గద్య మడి ప్రేంపావ (ద) క్షిణంబునం బుట్టెడు భూమి దానిం బూజారి మాధవ భట్లు దేవరకు గోసరి నివేద్యంబున కిచ్చిరి.

---

1. యనంబరగి- అని యుండవలెను.
2. డద్దేవునకు-అని యుండవలెను.

## 102. పాములపాడు

శ. స. ౧౦౯౪

ఇది గుంటూరు మండలము, గుంటూరుతాలూకా పాములపాడులో మల్లి కార్జున స్వామి యాలయమున కెదుట నందిస్తంభముమీఁద చెక్క బడినది. (A. R. 124 of 1917.)

ఉ. శ్రీమహిలాభిరాముండు విశేషితకీర్త్తుఁణుడు గొమ్మండర్థిఁచిం
త్తామణి దల్లిదండ్రులకు ధమ్ముఁవుగా శివధమ్మఁయుక్తుండై
పాములపాట నొప్పంగం గపర్ద్దిఁకి సజ్జనసంస్తుతంబుగా
ధీమణి వెట్టె నాత్మకుల దీపకమైన యఖణ్డదీపమును. 1

ఉ. చారుత రాబ్ధినందఖ(ని) శాకరసంఖ్య శకాబ్దము ల్సనను
ధీరుండు గేతనాత్మజుండు ధీనిధి వాముల పాటం గొమ్మం డి
ద్దారుణి నామృగాంకరవితారకమై చనం బెట్టెం బెంప్పున
న్మేరువు యుత్తరాయణనిమిత్తమునందు శశాంగ్కమౌళికిని 2

## 103. పాములపాడు

శ. స. ౧౧౯౪

ఇది గుంటూరు మండలములోని పాములపాడు గ్రామములోని మల్లికార్జున స్వామి యాలయము నెదుట నందినాగస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 123 of 1917.)

ఉ. శ్రీజననాలయుండు బుధసేవ్యుండు వేముండు సద్గుణుండు మా
తాజనకద్వయంబునకు ధర్మ్మ ఁవుగా శశిమౌళిధర్మ్మిఁ యై
రాజిత చంద్రమౌళికిం దిరంబుగం బాములపాటం బెట్టె స
త్పూజితమై మహిన్నెగడం బొల్పగుచున్న యఖణ్డదీపమును. 1

ఉ. వారక యానిశాకరదివాకరమై చనంగా శశాబ్దములు
ధారుణి వార్ధిఁనంధ్దదివితారకనాదమితంబుగా మహిని
గౌరత నుత్తరాయణము గారమై యేఱగాంక్క పుత్రుం డు
త్సారితదోషపుంజము విచారపరుణ్డు ధరాతలంబునను. 2

## 104. పాములపాడు

శ. స. ౧౧౯౪

ఇది గుంటూరు మండలము పాములపాడు గ్రామములో మల్లికార్జునస్వామి యాలయము నెదుట నంది నాగ స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. (A. R. 122 of 1917.)

ఉ. పాములపాటిమణ్డనకుం బంకరుహానన యేదుమాంబకుం
గామనిభుండు గొమ్మన సుఖస్థితిం బుట్టి నిజాన్వవాయసు
త్రాముండు దల్లిదండ్రులకు ధర్మువుగాం దనవృత్తిపై గ్రహ
గ్రామణిం బోల దీపక మఖణ్డితమై మహిం బన్విఁయొప్పంగాను. 1

క. సరది[1]నిధి ఖేందుసక[2] వ
త్సర సంఖ్యలం గార్త్తిఁక (ము)న దవలిమ పూన్నఁ
స్థిర గురుదినమునం గొమ్మన
యురుతర దీపంబు శివున కొప్పంగ నిల్పెను. 2

---

1. శరధి- అని యుండవలెను.
2. కళ- అని యుండవలెను.

## 104. పాములపాడు

శ. స. ౧౦౯౪

ఇది గుంటూరుమండలము పాములపాడులో మల్లికార్జునస్వామి యాలయము ఎదుట నంది నాగ స్తంభముమీఁద చెక్కఁబడినది. (A. R. 120 of 1917.)

ఉ. కామనిభుణ్డు భీమనకుం గామవసాన్కిం[1]బుట్టి బంధుచిం
త్తామణి యైనకొొణ్డ దుచిత(ం)బుగం బాములపాట సజ్జన
స్తోమనుతిం బ్రదీపకము ధూర్జ్జటి కెత్తె నఖణ్డవర్త్తియు
ద్దామయశఃప్రకాశి దమతల్లికిం దండ్రుకి[2]ధర్మ్ముగ వేడ్కను. 1

క. జలధినవాంబరశశిసం
ఖ్యలసకు[3] నేండ్లు[4] గార్త్తిగము పున్నమను
జ్వలగురుదినమునం గొణ్డం
డలఘుండు దీపంబు నిల్పె హరునకు వేడ్కను.

---

1. సానికిం- అని యుండవలెను.
2. శ్రీ దండి అని యుండవలెను.
3. శకు- అని యుండవలెను.
4. ఇచట గణము తప్పినది.

## 106. పాములపాదు

శ. స. ౧౦౯౪

ఇది గుంటూరు మండలములో పాములపాదు గ్రామమందు మల్లికార్జునస్వామి యాలయము నెదుట నందినాగ స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 121 of 1917.)

చ. విరచితకీర్త్తిలోలుం డగు వెన్నపరడ్డికిం బ్రోలసానికి
న్వరసుతుండైన బొల్లన ధ్రువంబగం బాములపాటం బార్వ్వతీ
శ్వరున కఖణ్డదీపకము సంద్రుండు సూర్య్యుండుం గల్గనంతాకా
దరణ వెలుంగ్గం బెట్టెం దనతల్లికి దండ్రకి ధర్మ్మ వేర్పడను. 1

క. గతినిధి ఖేందుశకాబ్ద
ప్రతతిం గార్త్తికము శుక్లపంచాదశి గో
పతిదినమున బొల్ల[1]
ణ్డుతులితదీపంబు నిల్పె హరునకు వేడ్కను. 2

---

1. గణము తప్పినది

## 107. తడికెలపూడి

శ. స. ౧౧౧

ఇది పశ్చిమగోదావరిమండలములో, ఏలూరుతాలూకా తడికలపూడిలో గాంగేయేశ్వరస్వామియాలయము కళ్యాణ మండపములో నొక స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 202.)

సీ. శ్రీశక వత్సరశ్రీశధరా(తళ)
శశిధరమితము(గాం) జైత్ర(బ)హళ
(ప)క్షత్రితీయ్యయు మేషసంక్రాంత్తినిమిత్తము(నం) వీరబలంజ్య
ధర్మఁనిర(తుం)డు దాచ(నై)తమసెట్టి కబ్జాతనేత్రి గేతమాంబికకు
నుం బ్రీతితనూజుండు మహితగుణాధ్యుండు మల్లిసెట్టి
భక్తి బె(ట్టె) నాండుం బల్లిహ(హరు)నకు నఖండదీప మాదరముగనే
యిరువ(ద్వి)ను మొదవులుం బ్రసిద్ధిగాంగ.
ఈపద్య ముందు తప్పులు మెండుగానున్నవి.

## 108. ఏలూరు మశీదు

శ. స. ౧౧౧౨

ఇది పశ్చిమ గోదావరీమండలములో ఏలూరులో మసీదు స్తంభముమీఁద చెక్కఁ బడినది. (South Indian Inscriptions Vol. V. No. 184.)

క. తరిణిశివశక సమంబు(ల
స)రసి[1] సోమేశ్వరునకు సంధ్యదీప[2]
లిరుసంధ్యలం జనం గ్గాటయ
వరపుత్రుం డమాత్యయయ్తి(వర)ంగం బెట్టెను.

1. సరసీ అని యుండనోపు.

2. సంధ్యాదీపం అని యుండవలెను

## 109. ఏలూరు మశీదు

శ. స. ౧౧౨౧

ఇది పశ్చిమగోదావరీమండలమున ఏలూరుమసీదులో నొక స్తంభముమీఁద చెక్కఁబడి యున్నది. (South Indian Inscriptions Vol. V. No. 189)

చ. గురుమతి మంత్రి శ్రీధరునకుం గ్గొసనాంబకు నంద్దనుణ్డు సు
స్థితుండగు[1] భీమశౌరి సరసీపురి(నొ)ప్పిన సోమనాథ దే
వరకు నఖణ్డదీపము ధ్రువంబుగ నేప్పఱడం బెట్టె రోహిణీ
శ్వరకరకైరవాప్తశశిసంఖ్యశకాబ్దము లువ్విఁఱం బవ్వఁఱంగాను.

1. స్థిరుండగు- అని యుండవలెను.

## 110. ఏలూరు మశీదు

శ. స. ౧౧౧౪ (?)

ఇది పశ్చిమగోదావరీమండలములోని ఏలూరు మసీదులో నొక స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 186.)

సీ. శ్రీశుభశకదరదిశవస్సరములు[1]
వేదత్రి(లో) చనరుంద్ర[2]సక్య[3]
వెలయంగ వైశఖ విమల సప్తమియును
సోమవాసరమున సుస్త్రిరముంగ
కొలని కేశవదే(వు) కొలికి[4] సుభటందు(ఎ)న[5]
పోతి కేతనల[6] ప్రీతితమ్ముం
డిహలోకమున సుఖ వింతియ[7] సాలు వొ
మ్మని తల్లిదండ్రిని నత్లం[8] దలంచి
మదనసద్రిశుండు (కా)వన దివ్యప్రోలం[9]
డమరపురమున కతిఁతో నరుగుచుండి
కొలనిసోమేస్వరునకును సలలితముంగా
సంధ్యదీపంబు వెటించ్చే సస్వత ముంగ.
వర నాలుగు సిదెడ సెట్టగోత్రవిలసద్ధిరుద్రసఖ్యల సురచితముగ సరసీపు

(అసంపూర్ణము)

---

1. ధరాధీశవత్సరములు- అని యుండవలెను.
2. రంద్రశబ్దమిచ్చుటకుదురదు. ఒకటి యనునర్థమిచ్చు వేఱొకశబ్ద ముండవలయును. 3. సంఖ్య- అని యుండవలెను.
4. కలికి- అని యుండనోపు.
5. భటుండెన ”
6. కేతనలకు- ”
7. మింతియ- ”
8. నల్ల- అని యుండవలయునేమో
9. ఈపాదముందు ఛందోభంగము గలిగినది.

## 111. పాలకొల్లు

శ. స. ౧౧౧౪

ఇది పశ్చిమగోదావరీమండలమందు పాలకొల్లు గ్రామములో శ్రీరామేశ్వర స్వామియాలయములో నొక రాతిస్తంభముమీఁద చెక్కఁబడినది. (South Indian Inscriptions Vol. V. No. 173)

క. మనుశివ(వత్సర) సంఖ్యం బయో[1]
జిని శ్రీసోమేశ్వరునకు శ్రీదుగ్గిఁకించే
కొని రెణ్డుసంధ్య దీపము
లొనరంగ భణ్డువుకొమరం ఊగిం బెట్టెదగను.

---

1. గణము తప్పినది- వత్సగశబ్దమునకు బదులుగా మితయని యుండిన సరిపోవును.

## 112. ఏలూరు మశీదు

శ. స. ౧౧౨౩

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరుమసీదులో నొక్కస్తంభముమీఁద చెక్కఁబడి యున్నది. (South Indian Inscriptions Vol. V. No. 185)

చ. పురకరకైరవాప్తశశిభూరిశకాబ్దము లొప్ప శాంఙ్జికిని
సరసిపురంబులో నిలిపె సంధ్ధియ[1]దీపము వెన్నిసెట్టికిం
దారుణియ ఘంట్టసాలపురి దారమకును[2] ఫలమొద్ద వీరికిని
వరసుత యైనవాసమ ధ్రువంబుగ నాశశి తారకంబుగాను.

ఈసంధ్య దీపము సేకొని కన్నమపణ్డితులు నామనయు రెణ్డుసంధ్యల నడపంగ్గలవారు.

1. సంద్దియ– అని యుండవలెను.
2. దారమకున్ అని చదువవలెను.

## 113. ఏలూరు మశీదు

శ. స. ౧౧౨౩

ఇది పశ్చిమగోదావరీమండలము ఏలూరుమసీదులో నొకస్తంభముమీఁద చేక్కఁబడినది. (South Indian Inscriptions Vol. V. No. 179)

చ. పరగంగమ్మ[1] వైశ్యనిధి భట్టిపురేశుండు ప్రోలిసెట్టి కం
బురుహదళాక్ష ప్రోలమసు[2] పుత్రుండు యాయ్తమసెట్టి పెట్టె శ్రీ
సరసిపురంబు క్రిష్ణునకు సంద్ధియ[3]దీపము శాశ్వతంబుగాం
బురకరశైరవాప్తశశిభూరిశకద్బము[4] లుర్వ్విపర్వ్వంగాను.
దీని సేకొని కన్నమపండితు నమనపండి(తు)లు నడపంగ్గలవరు.

---

1. ఇంకొకగకార ముండవలయును.
2. 'సు'కు బదులుగా 'కు' ఉండిన బాగుగానుండును.
3. సంద్దియ- అని యుండనోపు. ఈ పదము సంధ్యాశబ్దభవ మని గ్రహించునది.
4. శకాబ్దము- అని యుండవలెను.

## 114. ఏలూరు మశీదు

శ. స. ౧౧౨౪

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరుమసీదులో నొకస్తంభము మీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 183)

చ. చిరముగ ఘంటసాల యెఱసెట్లపుగోత్రము వెన్నిసెట్టికిని
సరసిజ నేత్రి దారమకు సత్సుత వాఁమ వెట్టెం బద్మినీ
పురమున సోమనాధున కపూర్వ్వముగా నిరుసంధ్యదీప మా
సరసిజగర్బ్భ వక్త్రకరచంద్రశశాంక్క శకాబ్దసంఖ్యలను.

## 115. ఏలూరు మశీదు

శ. స. ౧౧౩౧

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరుమసీదులో నొకస్తంభము మీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 177)

సీ. శశిరామరుద్రశకసమములం గేశవ
మం(డ్డ) లేశ్వరుబంటు మహిమ వెలయ
చం(ది)రు[1] దేవణ్డు దండ్డెమాంబికకును
శ్రీయుతు ణ్గెల్లమనాయకునికిం
గౌరికి[2] పుత్రుణ్డు గొమరుగాం దనభార్య్యా
ముప్పమకును ధమ్మ్మా వొప్పుచుణ్డ
సంధ్దియ[3] దీపంబు శాశ్వతంబుగం బెట్టెం
గొలనిసోమేశున కెలమివెలుంగం
చెలువుగాంగ దీనిం జేకొని కన్నన
పండితుండు నడపుచుణ్డువారు
బెడంగుగానాచంద్ర[4]
తారకముగ నెల్లవారుం బొగడ.

---

1. చందిరు అన్నచో ఛందోభంగ మయినది- సరియైన పేరు తెలియదు.
2. గూరిమి- అని యుండనోపు.
3. సంధ్దియ- " ఇది సంధ్యాశబ్దభవము.
4. ఈపాదములోఁ గొంత భాగము లుప్తమయినది.

## 116. శ్రీకూర్మం

శ. స. ౧౦౩౧ (?)

ఇది గంజాముమండలము శ్రీకాకుళము తాలూకా శ్రీకూర్మములో కూర్మేశ్వర స్వామియాలయము ఉగ్రాణపుగది కుడిప్రక్క స్తంభముమీఁద చెక్కఁబడి యున్నది. (South Indian Inscriptions Vol. V. No. 1250)

సీ. గగణగుణాత్మేంద్దుగణనశకాబ్దము
లు[1] సనం చైత్ర[2] సితమష్టిశశిదినమున
నఖిలసురాసురేద్రానర్ఘ (ము) కుటాగ్ర
సద్రత్న రంజ్జిత (చ)రణుం డైన
కూర్మ్మ నాథునకు సద్గుణి మాపగాము
శాసనుం డుపమ(న్యు) సన్మునివరేణ్య
గోత్రుం దేతమనాయకునకుం గండెమకునుం
దనయుండు వంశ వర్ద్ధనుండు ధర్మ
వినుండు రేవన ఒంబర వెల్లి నాగ
బంద్ధమున విల్చి పుట్టెడు వం(టి)[3] పొలము
దెలుపు మిగుల నఖణ్డప్రదీపమునకుం
దనరంగాం బెట్టె నాచంద్ర తారక ముగ.

---

1. ల్ - అని యుండవలయును.
2. సనంజైత్ర- అని యుండవలయును.
3. ఈశబ్దము రూపము సందేహాస్పదముగా నున్నది.

## 117. ఇప్పటం

శ. స. ౧౧౩౩

ఇది గుంటూరుజిల్లా గుంటూరుతాలూకాలోని ఇప్పటము గ్రామములోని మల్లేశ్వరస్వామియాలయము నెదుట నున్న యొక ఱాతిమీఁద నున్న ది. (A. R. 88 of 1917)

సీ. శ్రీశక రాజాభి శేక వత్సరములు
పుర రామచంద్ర భూపరిమితముగ
నమరంగ్గం బౌష్యమాసమున పంచ్చాదశిం
గమలాప్తదినమున విమలధర్మ్మ
మతి న్రిపచారిత్ర నుతికెక్కు గండ్డభూ
పతిసుతుం డౌదార్య్యమతిం దలంచి
సమ్మతుండై కోట ముమ్మడిదేవన
రేంద్రుండ్డు విభవసురేంద్రసద్రిశుం
డభిమతార్థధర్మవిభవశౌర్యోన్నతిం
దనరి వెలుంగ నిచ్చె మనుచరిత్రుం
డవని దేవతతికి భువి దాన మేప్పాడం
దరణిరజనికరసుతారకముగ.

## 118. ఏలూరు మశీదు

శ. స. ౧౧౪౫

ఇది పశ్చిమగోదావరీ మండలములో ఏలూరుమసీదులో నొక స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 178)

క. సరసిపురి సస్వతం బై
శర వార్ధిశశాంక భూమిశంకెమెయి న్నీసు
స్థిరుండగు (వ)యపకొమన.[1]

1. ఇందు తప్పులున్నవి, పద్య మసంపూర్తిగా నున్నది.

## 119. ఏలూరు మశీదు

శ. స. ౧౧౫౦

ఇది పశ్చిమగోదావరీ మండలములో ఏలూరుమసీదులో నొక స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 102)

సీ. శ్రీరమ్య మగుసరసీపురి సోమేశ్వ
రునకును విష్ణు దేవునకు భక్తి
యమరంగ నిరుసంధ్ధియలయంద్దు నెంతయు
వెలుగంగ్గ ధారుణి వ(ల)య నాయం
డగు కేశవాధీశు నతివ శ్రీగు(డు) పూండి
గోకర్ణ దేవునకును ముదమునం
బ్రాసాద మెత్తించ్చి బహుధర్మవులయంద్దు
వరగిన మల్లాం(బ) వరసుపుత్రి
వ్యోమసాయకభూసుధాధా(మ) సంఖ్యం
గార్త్తికము శుద్ధశివతిథిం గాంత్తి సహితుం
డగుగదాధర దేవని య్యైతమాంబ
(స)ంధ్యదీపంబు లొగిం బెట్టె సాశ్వతముగ.

## **120.** ఏలూరు మశీదు

శ. స. ౧౧౫౦

ఇది పశ్చిమగోదావరీమండలములో ఏలూరుమసీదులో నొకస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 193)

క. అంబరశరశివసంఖ్యం ద్రి
యంబకవ ... లకు దయామతితో నై
తాంబ సరసీపుర ...
దం బమరంగ సంధ్యదీప తతివెట్టె.

## 121. కొమ్మూరు

శ. స. ౧౧౬౬

ఇది గుంటూరుమండలము బాపట్ల తాలూకా కొమ్మూరు గ్రామములో కాశి నాథేశ్వరస్వామి దేవాలయమునం దొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది. (A.R. 826 of 1922)

సీ. శ్రీయుత మైన కొమ్మురియగస్తేశ[1]
విభునకు దీపంబు విస్తరిల్ల
నెసగుదీ పావలి వసుధలో... ంచ.
నగతీశ్వర[2]స్వామి(క)ర్తిఁతోడ
పురుషనిధానుండు సురరాజసద్రిశుండు
ముత్తియ నాయంక్కు పౌత్రుండ ...[3]
బలుం దరివీరుల భంజించి (పే)కొఁన్న
నాగినాయకుప్రియనందనుండు
అతులధర్మఁ మూర్తిఁ యనుపమ ... తకీర్తిఁ
కొండమాంబసుతుండు కో(కిఁ)తోడ
ప్రోలినాయకుండు వొల్పు(గా) దీపగం
బంబు నిల్పె భువనిం(?) ప్ర(స్తుతి)ంప.

స్వస్తి శ్రీశక వషఁంబు(లు) ౧౧౬౬ నేంట్టి పౌష్యబహుళ ఁ ఆదివారము నుత్తరాయణసంక్రాంతి నిమిత్యమునం- మొ.

---

1. శ్రీయుత మగుకొమ్మురీయగస్తీశ్వర (స్త్యేశ్వర)- అని యుండిన ఛందో భంగము కాకుండును.

2. అగతి అనునది అగస్తికి తద్భవ రూపముగా వాడఁబడినది.

3. యతిభంగ మయినది

## 122. ఆచంట

శ. స. ౧౧౭౭

ఇది పడమటిగోదావరిజిల్లా నరసాపురము తాలూకా ఆచంట గ్రామములో రామేశ్వరస్వామి యాలయము దక్షిణపుగోడలఁ గట్టఁబడిన యొక ఱాతిమీఁద చెక్కఁబడినది(A. R. 700 of 1926)

శక వషంబులు ౧౧౭౭ గు నేంటి ఉత్తరాయణ సంక్రాన్తినిమిత్తమున (ఆసంట్టటశ్రీరా) మీశ్వర శ్రీమహాదేవరకు రాజెమరాజు ఎఱ్ఱలక్ష్మీరాజు వేంగీశ్వగుండు పినలక్ష్మిరాజు ... రును పెట్టిన అఖండదీపము నకు... ...

క. ఇనశశిదిగ్గజ తారక
వననిధికుల శైలగగణవసుధాగ్ని సమీ
... కలయన్తకాలము
వినుతం బై దీప్తి మిగిలి వెలుంగుచునుండును.

## 123. త్రిపురాంతకం

శ. స. ౧౨౬౪

ఈశాసనము కర్నూలుజిల్లా త్రిపురాంతకములోని త్రిపురాంతకేశ్వర దేవాలయములోని చీఁకటిమిద్దె తూరుపుగోడమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 230 of 1905)

సీ. శ్రీశక రాజ్యాభిషేక వత్సరములు
జలనిధి(తర్క్కార్క్క)సంఖ్యం బరగం
ప్రవిమల[1] (తరచిత్ర) భానువత్సరమ్మున[2]
వినుత కార్త్తికమాసవిమలపక్ష
కలితపంచాదశిం గమనియ్య(తర)సోమ
వాసరంబున బుధవర్ణ్ణనీయ
ల... ... సముల్లాసంబు దీపింప్ప
రత్న జాంబూనదరచిత మైన
వైజయంతి కుమారాద్రివాసునకును
అంబ్బికానాథునకుం ద్రిపురాంతకునకు
భక్తిం బ్రణుతించ్చి యెత్తిచ్చెం బరమపుణ్య
సోమభూవరుపో(తాంబ) సుస్తిర ముగ.[3]

---

1. విమల- అని యుండవలెను.
2. వత్సరిమున- అని యుండవలెను.
3. సుస్థిరముగ అని యుండవలెను.

## 123. శ్రీశైలం

శ, స. ౧౨౯౯

ఈపద్యము శ్రీ శైలములో మల్లికార్జునస్వామి దేవాలయము లో నంది మండపమునకుఁ చేరియున్న మండపము కుడియెడమస్తంభములమీఁదఁ జెక్కఁ బడినశాసనములోఁ జివరఁ గనఁబడుచున్నది... (A. R. 20 of 1915)

సీ. శ్రీపర్వతస్థలి చెలువగుశ్రీమల్లి
కార్జునస్వామిగేహాంగణమున
మహనీయ్యమగు వీరమంటపం అనెకష్ల[1]
విలసితం బగుపుణ్యస్థలినొప్ప[2]
కట్టించి జగనొబ్బగండ్డన్న వేమభూ
విభుని ...శ్వరధర్మ విభవకీర్తి
సకలదిక్కులునిండి సాంద్రమై ఆచంద్ర
తారకః స్థితి నుర్వి తనరజేశె
శాంకరాగమమంత్రదీక్షావిభూతి
దంచితా[3]చారుం దగుచున్న పంచభిక్షం
రామనసుతుండు నిమ్మ... వంశుండు
మల్ల నాఖ్యుండు శివభక్తిమార్గరతుండు.

---

1. ఈశబ్ద మేదియో తెలియుటలేదు
2. స్థలిని నొప్ప- అని యుండనోపు.
3. అంచితా- అని యుండవలెను.

## 124. భీమవరం

శ. స. ౧౩౪౫.

ఇది గోదావరీమండలము భీమవరము తాలూకా భీమవరగ్రామములో భీమేశ్వరస్వామిగుడి యెదుట నున్న మండపములో నొకస్తంభముమీఁద చెక్కఁబడి యున్నది.(A. R. No. 460 of 1893)

సీ. ధరం జతుర్ధాన్వయాభరణుండు దేవయ
తనయుండు దూలశింగనఘనుండు
శకవర్షములు బాణసాగరరా(మే)౦ద్దు
వరసంఖ్య నగు క్రోదివత్సరమున
అరుదారంగా గువరారామ[1] భీమేశ్వ
రునకు నొప్పార భూజనులు మెచ్చ
కల్యాణచంద్ర శేఖనమూర్త్రిం జేయించి
యెలమిం బుట్టెడు శేను[2] విలిచిపెట్టి
(త్రో)పుఘంటయుం గంచ్చునదీపగంభ
మును సమర్పించ్చి గోవులం దనర నిచ్చి
పట్టుచీర యుం బళ్ళెంబు భక్తి నొసగెం[3]
దనద్దు[4] ధర్మంబు లాచంద్రతారక (ము) గా.

---

1. గుమారారామ అని యర్ధము.
2. సేను - అని యుండవలెను.
3. నొసంగెం అని యుండవలెను.
4. దనదు అని యుండవలెను.

## 125. ఇడుపులపాడు

శ. స. ౧౪౨౨

ఈపద్యము గుంటూరుజిల్లా బాపట్లతాలూకాలోని ఇడుపులపాడు గ్రామము లోని చెన్నకేశ్వరస్వామిదేవాలయములో గరుడస్తంభముపై నాల్గువైపులను చెంక్కబడి యున్న యొక సంస్కృతశాసనమునం దిమిడియున్నది- (A. R. 802 of 1922)

వంశావళిపద్యము.

సీ. శ్రీయాజ్ఞవల్క్యప్రసిద్ధాన్వయమునందు
ముఖ్యుండు దామయ్య ముత్తతాత
గురుభరద్వాజసద్గోత్రోద్భవుం డైన
ధన్యుం డనంతయ్య తాతతాత
నిత్య సత్య ... ...వి మానాఖ్యుం ..
ముత్తనాయ ... తంద్రితాత
భూరి వైభవ ... గబ్బుఁరం డీతం డనంగం
దనరు కొండయమంత్రి తండ్రి తండ్రి
మహిమతో దుర్మ్మంత్రిమానమర్దనుం డైన
ఘనుండు ముత్తయమంత్రి కన్న తండ్రి
పరమపాతివ్రత్య భాగ్యసంపన్నయౌ
కమలాక్షి సింగాంబ కన్న తల్లి
అగ్రగణ్యులు కొండయామాత్య చంద్రుండు
రమ్య వైభవుండు శ్రీరంగ విభుండు
తేజోబలారోగ్యధీసమగ్రుం డైన
నయశాలి తిమ్మయ్య నంద్దనుండు
విభ వాస్పదం బైన వినికొండతూపుఁరన
తనరు నిడుపులపాడు[1] తానకంబ్బు
జలజలోచనుండు కేశవదేవుండు ....
వేల్పు వెలయ దిమ్మయ ప్రోలవిభుండు[2]
(తక్కినది స్పష్టముగాఁ దెలియుట లేదు)

---

1. నిడ్పులపాడు అని యుండనోపు. జలజలోచనుండు కేశవదేవుం డిలువేల్పు
2. ఈపాద మిట్లుండవలయును- వెలయ దిమ్మయప్రోలవిభుండు.......

## 126. ధర్మవరం

శ. స. ౧౫౨౨

ఇది గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకాలోని ధర్మవరము గ్రామములో సీతా రామస్వామియాలమున కెదుటనున్న యొక ఱాతిపైఁ జెక్కఁబడినది. (A.R. 811 of 1922)

సీసము. వివిధ సేనలం(దూ)రి[1] పెద్ద గుంపులు సేసి
(పదిరిగా)ల్చినయట్టిపాలెగాండ్ల
దుర్గాధిపులబిరుదులు రణావనిం గొట్టి
పట్టించుకొనియెడుపాలెగాండ్ల
పూర్వాబ్ధిపర్యంతమును దాడివెట్టిన
పడమటిగట్ల పాలెగాండ్ల
జలదుర్గగిరివనస్థలదుర్గ భూముల
పట్టు గల్గినయట్టి పాలెగాండ్ల
మహితఘుమఘుమ ముమడిమొ మానినాద[2]
మాత్రమునం బశ్చిమాంబుధి మహికి మిగులం
బరువు వెట్టించ్చి మహమందు పాదుశహస్ర
ధానవర్యుండు యెకలాసఖానవిభుండు.

ఇటువంటి యెకలాసఖానునింగారు అద్దంకిసీమలో ధర్మవరము నందు తనపేర యొకలాసఖానపురమని పేట గట్టించి యీపేటకు కౌలు ఇచ్చిన వివరం.

---

1. గూర్చి-అని యుండవలయునేమో?
2. దీనియర్థము స్పష్టముగా లేదు.

## 127. శ్రీకూర్మం

శ. స. ౧౬౮౫.

ఇది గంజాముమండలము శ్రీకాకుళముతాలూకా శ్రీకూర్మములో కూర్మేశ్వర స్వామియాలయము తిరుచుట్టుమండపములోని యిరువదిమూఁడవస్తంభము వాయవ్యమూల దక్షిణముఖముగా చెక్కఁబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 1203.)

స్వస్తిశ్రీ॥ శాలివాహనశకే గతాబ్దాః ౧౬౮౫ కాంగ్గా

శ్లో: శ్రీమత్కూర్మపురే సమస్తభువనఖ్యాతే మహాయత్నతః
శ్రీరామం నిజలక్మణేన సహితం కర్త్తుం మహావైభవాత్
శ్రీరామానుజలక్ష్మణస్య సుతనో భ్గక్త్యా శు కూర్మాలయే
సర్వైశ్వర్యయుతే సమస్తశుభదే లోకైక నేత్రోత్సవే.

శ్లో. శ్రీమద్భాష్యకులాబ్ధిసోమసుమహావేదాంతవర్య స్సదా
స్వాచార్యైకమనా స్సమస్త గుణయుక్ శ్రీమత్సుభాన్వా(ం)హ్వాయే
వర్షే మాసిచ జేష్టసంజ్ఞని నిజే చిత్తాఖ్యఋక్షే శుబే
శ్రీమత్సద్దశమీదినే శుభకరే వారేచ సోమస్యవై.

శ్లో. సర్వోత్కృష్ట మపూర్వ వస్తునిచయైః కృత్వా ప్రతిష్ఠాం శుభాం
తత్పూజాది మహోత్సవం సమతనో త్కీర్తివృద్ధ్యై సదా.

శ్లో. పూర్వంమహారాష్ట్రజనైర్హృతోభూత్సౌమిత్రిరార్యాగ్రతేవదుష్టైః
తదాప్రభృత్యేవ సరామదేవః మహోత్సవస్థోపి బభౌ న కర్హిచిత్.
విజ్ఞాతతద్వేదవిదాం వరిష్టో వేదాంతవర్య స్స్వకరో త్ప్రయత్నం
శ్రీలక్ష్మణస్యాపి కృతౌ శుభాయాం సమస్తరాజన్యవరైరసాధ్యం.
శ్రీశంకరాఖ్యంరథకారమాశుసమాంహ్వాయామాససురామతీర్థాత్
తేనైవ సర్వోత్తమశిల్పిసంవిదా సకారయామాస సులక్ష్మణాకృతిం.
రాయాచార్యకృతా నాదౌ శ్లోకాన్ లిఖితవా నహం
తతో ముద్రచితాః పద్యాః లిఖితం చ్చాంద్రభాషయా.

శా. ఆదిన్మాధ్వు ల్రఘుపతిని రామానుజ న్భూమిపుత్రి
న్మేదిన్మోదంబున సితగిరి న్నిల్పినంత్త న్మహారాష్ట్రుల్ దా
సౌమిత్రిశరగొనిన న్రూఢిగావింప్ప భాష్యం
వేదాంత్తాచార్యులు మగిడి దా వేడ్కతో జేయుమంన్నన్.[1]

క. కాకుస్థవంశజానుజ । చేకొని హరిభక్తులెల్ల సేవించుటకై
శ్రీకూర్మక్షేత్రంబ్బున । వాకలపుడి శంక్కరుండ్డువరుసస్పృజించ్చెనూ.

చ. అరయగ శాలివాహన శకాబ్దము లుర్వి పదారునూలఁపై
నిరవుగ నెన్బదేను గతియించిన వెన్క స్వభానునామవ
త్సురనిజశుక్రశుద్ధమున సాధకమౌ దశమి న్ప్రంగాకవా
సరమున చిత్తయందు నతిసౌఖ్యత సల్పిరి పూజలక్ష్ములనూ.

క. శ్రీకూర్మేశ్వరుసాక్షిగ । మాకిచ్చిన భూమికలదు మహి నెవరైనన్
బూకరమున లేదనినను । చీకాదని నడుపవలయు క్షితిపతులైననూ.

క. తొలుతనురాయాచార్యులు । వెలయగశ్లోకములు చెప్పె వెనుకను పద్యం
బ్బులు నే తెలుగున జెప్పితి । సలలితకవిజదివిరెం(ట్టి)జాడలనెంచ్చునూ.

గీ. పరగ నీరాతి పడమటి పలకయంద్దు । పజ్తితడబడిచెరిపియుపంక్తిమగిడి
చెక్కినాడనుననునింద్దసేయవలదు । కలవుచేతప్పులనిమదిదెలియవలయు.

గీ. విగ్రహంబు చేసి వెలయంగ్గ పద్యముల్ జెప్పి స్తంభముననుచెక్కి నాడ
యొప్పులుంన్న నుత్తము లగువారు[2] సంమ్మతించ్చవలె నసంహ్యాపడక.

జగద్గురవేనమః.

శ్రీ ఆదిన్మాద్వుల్ రఘుపతిని రామానుజుకి భూమిపుత్రి
నేది మోదంబున సితగిరిక్ నిల్పినంత మహారాష్ట్రుల్ దా
సౌమిత్రి శరగొనినన్ రూఢి గావింప్ప భాష్యం.

తొలిపద్యంలో అక్షర సంధులు తెలియనివాకి(ఁ) తెలిసేటందు కీమూడు చరణములు మల్లి పొల్లులు విడచెక్కినాడను.

---

1. మొదటిపద్యములో ఛందోదోషములు పెక్కులున్నవి.
2. ఈపాదములో నొకగణము పోయినది, మొత్తముమీఁద నీకవిత్వము తప్పులతడక

## 128. శ్రీకూర్మం

శ. స. ౧౨౩౨

ఇది గంజాముమండలము శ్రీకాకుళముతాలూకా శ్రీకూర్మములో కూర్మేశ్వర స్వామియాలయము తిరుచుట్టుమండపములో నిరువదియాఱవ స్తంభము నుత్తరపు వైపున చెక్కఁబడియున్నది. (South Indian Insariptions Vol. V. No. 1212.)

సీ. శాలివాహనశకశరదంబులును వేయే
ఙ్నూటత్రిదశకం బెలమ[1]ందు
వరప్రమోదూతసంవ్సత్సర[2] వైశాఖ
శుక్ల తదియ మరియు భాను
వారము మృగశిర (వ)నరి నక్షత్రంబు
రాశి మేషంబున రమ్యముగను
శ్రీకూర్మనయక[3] శ్రీపాద స(న్ని)ధి
దనర చామర్తి సీతయకు వేద్య
సుందరాపురవృత్తిఁ ముందుగా ధనంబు[4]
కోరి తా ఇచ్చి ధీరుడ వని
మాతృగోత్రోద్భవ మండ్డలతంమ్మన్న
అరయంగ నిత్యపంచామృతంబు
శుభగుండై మిగుల భూసురవ(రు)ల్ బొగడంగ
నభిషేక మొనరించె భక్తితోడి
అరయ సహస్ర నామచర్చన చామరం
బును కంకణమును మరి ఘనసురటియు ...
(యో?)గశేవల షోడశోపచార సమేత
మైన పూజలు సల్పె మాన్యు డగుచు
ఆచంద్రతారార్కఁ మవనియెందున పుత్ర
పౌత్రాభివృద్ధియై ప్రబలియుడు

యెనుచు విజ్ఞానశాస్త్రంబు నెలమి
చదివినభూసురేంద్రులు ఈరీతి సుస్తుతింప్ప
విని కృతార్థుఁడ నైని నవ్వేదుకలరా(ర)
ధర్మమిది యెని వినుతించే ధాత దివిని
స్వదత్తాద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం.

---

1. చెలిమి- అనియుండనోపు.
2. సంహ్వాత్సర- అని యుండనోపు
3. నాయక- ఆ యుండవలయు
4. ఈయుత్తర భాగములో ఛందస్సు తప్పినది.

## 129. శ్రీకూర్మం

శ. స. ౧౭౩(౨)

ఇది గంజాముమండలము, శ్రీకాకుళము తాలూకా శ్రీకూర్మములో కూర్మేశ్వర స్వామి యాలయము తిరుచుట్టు మండపములోని యిరువది రెండవస్తంభము నుత్తరపు వైపున చెక్కcబడియున్నది. (South Indian Inscriptions Vol. V. No. 1202)

సీ. శాలివాహనశక సంవ్వత్సరములు వె
యేృడు నూటాముప(దా)రు వెళ[1]
గను ప్రమోదూత[2]హయన వైశాఖ[3]
శుద్ధ తృతీయార్ఠశుభదినమున
ముగశీషc[4] నక్షత్ర మేషలగ్నమునందు
శ్రీకూర్మ నాయక శ్రీపదములు
సంత్తతంబును బూజ జరిగించు మనుచు చా
మర్ల సీతారామమహీసురునకు
ముత్యగోత్రభవుడు మంధల తంమంన్న[5]
సుందరపురవృత్తిc[6] సూర్యసోము
లెంత్తగాలముందు రంత్తపర్య(ం)త ము
నాత్మ పుణ్యకీర్తుc లలర నొసగె.

---

1. ప్రమోదూతసంవత్సరము ౧౭౩౨ వ శకసంవత్సరమునకు సరిపోవును.
2. ప్రమోదూత. అని యుండవలెను.
3. గణభంగ మయినది.
4. మృగశీర్ష - అని యుండవలయును.
5. గోత్రము పేరు మత్య లేక మత్స్య అని గాని పురుషుని పేరు ముందల తమ్మన్న అనిగాని యుండవలెను. పైశాసనములో మాతృగోత్రోద్భవ మండ్డలతంమ్మన్న - అనియన్నది.
6. వృత్తి అని యుండవలెను

## 130. వేల్పూరు

శ. స.

ఇది గుంటూరుమండలము సత్తెనపల్లితాలూకా, వేలుపూరు గ్రామములో రామలింగేశ్వరస్వామి యాలయముదగ్గఱఁ బడియున్న యొక చితికిపోయిన ఱాతిమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 588 of 1925.)

సీ. ... ...ంచ్చిప్రభనొప్పి పెగ్గ ......
నిమ్మాలభూరి కీర్తి.. ... ...
యాత్రయ ... పవిత్రుండు వ్రేకెటి
పురవల్లభుండు గుణాకరుండు ఘనుండు.
దనకులస్వామి నుద్ధతరాజగజరాజ
మృగరాజవరు జగమెచ్చుగణ్డ
భూపాలు సబ్బాంబికాపుత్రు దన్నద
కేతవల్లభు జగద్దీతకీర్తి
బ్రీతి(ం) గొలిచి తనసునీతి వాచాలతం
గాం(గ) ఖడ్గములం బ్రగల్భతరని
యోయో(గు)ంద్దె సమున్నతసంపదలు
దాల్పినెగడె బుధులు దన్నుం బొగడ.

మ.వృ. అనిశంబు(ఁ) దనబుద్ధిపేమ్మిఁం బతిం దంత్రావాప్తిం...ం(ట్టి)ంచ్చుచుం
దనవిక్రాంత్తి నరాతివర్గము(భు)జాదప్పంబు భంజించ్చుచుం
దనదాక్షిణ్యవిశేషతను బుధుల మిత్రశ్రేణి రక్షించ్చుచుం
ద్దనరెం గేతధరాతలేశు శచినోత్తంశుండు ప్రోలుండిలను.

## 131. (పాత)పల్లవరం

శ.స.

ఇది చెన్నపురము సమీపమున, పల్లవరము దగ్గఅనున్న పాతపల్లవరములో నొకనూతియొద్ద నొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది. (A. R. 55 of 1909.)

సీ. కసిమియ్యసాహేబు కనకీర్తిఁ రంజిల్ల
షేకుహుస్సానకు[1] చెల్వమమర
పల్లావరంబ్బున ప్రఖ్యాతమైనట్టి
పేటగావించెను పేర్మిఁతోడ
జగదేకవిఖ్యాతి జనపతు లెన్నంగా[2]
సంత సాగించెను శాశ్వతముగ
సకలజనాధార సరణియై దనరంగ్గ
భావిలు కల్పించెను[3] ప్రౌఢిమెరయ
సైదిభురాహేము సాహెబుపేరిట
విభురాముభాగని వెలయజేసె
గంర్తాపదంబ్బున గంభీర మైనట్టి
చావళ్ళు గట్టించ్చె (సాస్వ)తముగ
అనుచు వజ్రీలు (మ) న్నీలు అభినుతింప్ప
వెలసితివి ధరలోన వినుతికెక్కి
శెఖుఅలావబ్దిను[4] గభాఁబ్ధి ((సే)కరమున[5]
శేకు ముసామియ్య నృపాల శేఖరముంగా[6]

1. హుస్సానుకు– ”
2. లెన్నంగ్గ–అని యుండనోపు.
3. భావులుకల్పించె – ”
4. గణము తప్పినది.
5. శీతకరుండ– అని యుండనోపు.
6. ఈపాదము షేకుముసమియ్య నరపాలశేఖరుండ అని యుండనోపు.

## 132. మందడం

శ. స.

ఇది గుంటూరుజిల్లా గుంటూరు తాలూకా మందడముగ్రామములో మల్లికార్జునస్వామి యాలయములోని అమ్మవారి గర్భగృహము గోడమీదనున్నది. (A. R. 104 of 1017.)

ఉ. (మొదట గొంతభాగము పోయినది)

సూరమాంబికకు మిక్కిలి పుణ్యుం(డు)దారకీర్తిఁల

**సంపూర్ణము.**

